సాధన గ్రంథ మండలి – 69.

# శ్రీ తులసీ మహిమామృతము



మూలము :

శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీ

ఆంధ్రానువాదకుఁడు :

దాసశేషుఁడు



ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.



1958

[ వెల రు 1–8–0

# శ్రీ రామ సేవ

ఈ "తులసీ మహిమామృతము" అను పవిత్ర గ్రంథమును వంగభాషయందు వర్తమాన సుప్రసిద్ధ సిద్ధపురుషులగు శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీ మహాత్ములు రచించిరి. ఆ పవిత్ర గ్రంథమును శ్రీ బాబాగారి కృపాదేశము దాసుఁడు తెనుఁగుబాసయం దనువదించి శ్రీ భక్తసంజీవని మాసపత్రిక యందుఁ బ్రకటించు భాగ్యము కలవాఁడయ్యెను. దానిని ప్రత్యేకగ్రంథముఁగాఁ బ్రకటించి సాధన గ్రంథమండలి వారు తెనుఁగువారి కెంతో యుపకారము గావించిరి. సాధన గ్రంథమండలివా రొనరించు లోకోపకృతులను గుఱించి తెలుఁగు వారికిఁ దెలిసియేయున్నది. ఈ మండలివా రితోధికకృషి చేసి తెలుఁగువారి యభ్యుదయమునకు సాధనసంపాదకులై చిరస్థాయిత్వమున విలసిల్లెదరుగాత!

ఇట్లు విన్నవించు

దాసశేషుఁడు.

ఓమ్

# సమర్పణ

ఏతద్గ్రంథకర్తలగు

## శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీవారికి

ఈ యాంధ్రానువాద

## తులసీ మహిమామృతమును

ప్రేమపూర్వకముగ సమర్పింపఁబడినది.

— దాసశేషుఁడు.

# నివేదన

అనంతమయ ప్రపంచమున అనంతుని అవతారము లనంతములు. చరాచర ప్రపంచమంతయు భగవత్స్వరూపమే. భగవత్స్వరూపములుగా నవతరించి, ఈ కలిలో మానవులచే నారాధింపబడు వృక్షములలో తులసి యొకటి. హిందువుల ప్రతి గృహమున తులసి గృహదేవతగా నారాధింపబడు చున్నది. ఇట్టి తులసీమహిమ వివిధపురాణములు, వేదములు, ఇతర శాస్త్రములు బహుముఖముల కీర్తించినవి. తులసి మహిమ యపారము. దర్శనమాత్రముననే సర్వపాపములు నశించును. అర్చనాదులవలన సర్వకామ్యములు సిద్ధించును. తులసి స్త్రీలపాలిట భూలోక కల్పతరువు.

తపస్సంపన్నులు, సిద్ధపురుషులు, నిరంతర భగవన్నామ జపపరాయణులు నగు పూజ్యపాదులు శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీ మహాత్ములు వివిధపురాణాదిగ్రంథములయందలి తులసీమహిమ, ఉత్పత్తి, అర్చనావిధానము, తులసీకల్యాణము మొదలగు విషయములను విశేషముగా బెంగాలీ భాషలో గ్రంథరూపమున అవతరింపజేసిరి. ఈ గ్రంథమును తపస్సంపన్నులు, శ్రీరామభక్తులు, నిరంతర భగవన్నామజప పరాయణులు, అచిరకాలముననే నూటయెనిమిది పర్యాయములు శ్రీమద్వాల్మీకిరామాయణ పారాయణ మహాఫలభాగ్యమును పొందినవారు అగు పూజ్యపాదులు శ్రీ శ్రీ దాసశేషులు 'భక్త సంజీవని' పత్రికాముఖమున ప్రకటించి భక్తకోటికి మహోప కారము చేసిరి.

శ్రీ దాసశేషులవారి యనుమతితో మా సాధన గ్రంథ మండలిలో నీ 'తులసీమహిమామృతము'ను గ్రంథరూపమున ఒక పుష్పముగా ప్రకటించు సదవకాశము గలిగించినందులకు శతధా వారికి ధన్యవాదములు సమర్పించుచున్నాను.

ప్రస్తుతము లోకకల్యాణార్థముగా శ్రీదాసశేషులవారు చేయుచున్న శ్రీరామ మహాసామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవ సందర్భమున ఈ గ్రంథమును ప్రత్యేకముగ శ్రీశ్రీ సీతారామదాస ఓంకారనాథజీ మహాత్ముల కంకితముచేసి, ప్రకటింపజేయు మహాభాగ్యమును కలిగింపజేసిన శ్రీశ్రీ సీతారామదాస ఓంకారనాథజీవారికి, శ్రీ శ్రీ దాసశేషులవారికిని అనేక ప్రణామములు చేయుచుంటిని.

ఈ గ్రంథమును సాదరముగ పఠించి, శ్రీ తులసీ మహిమను తెలిసికొని, తులసీ సేవా మహాభాగ్యమును పాఠక లోకము పొందుదురుగాక యని విశ్వసించుచుంటిని.

విలంబి వసంత పూర్ణిమ

వినీతుడు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి



# శ్రీ తులసీ మహామ్మ్యతము

## ప్రథమ ప్రకాశము

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ తులసీం తాం నమామ్యహమ్॥

శిష్యు:- దేవా! తాము తులసి నింతగా బొగడెదరేల?

గురు:- తులసీమహారాణిని యెప్పుడును పొగడఁజాలము. తులసి నేనాఁడు స్తోత్రము చేయఁగలిగితిమో యానాఁడు సకలసాధనలు పూర్తియయినవే. శ్రీ భగవానుఁ డిఁక దూరముగా నుండఁజాలఁడు.

శిష్యు:- తులసియేమొ చెట్టు. దానిని సేవించిన శ్రీభగవానుని సన్నిధి యొసఁగుననుట నాకేమియు సరిగా బోధిపడినది కాదు.

గురు:- నీవు పురాణములు, సంహితలు, తంత్రాది శాస్త్ర గ్రంథముల నొప్పుకొనెదవా?

శిష్యు:- పూర్తిగా అజ్ఞ యని భావించుచున్నాను.

గురు:- ఆ పురాణగ్రంథములనుగనుక చూచిన వానియందుఁ దులసీమాహాత్మ్య మేవిధముగా వర్ణింపబడినదో తెలియ నగును. తులసి వృక్షము కాదు. స్వయం విష్ణువే. తులసి వృక్షము కాదు. స్వయంతారిణి (తరింపఁ జేయునది). శ్రీ భగవానునికి బరమప్రీతి నొసఁగునది. ఆయన యేవిధ ముగా వర్ణించెనో మఱియెక్కడను ఎవరును వర్ణింపలేదు. చెప్పుచున్నాను చూడు. నాయనా! విష్ణుప్రియ యయిన

యా తులసిని సేవించినచో మన ప్రభు వింక దూరము దుండఁగలఁడా ?

తులసీ స్పర్శనం స్నానం తులసీ స్పర్శనం తపః।
తులసీ స్పర్శనం ముక్తిః తులసీ స్పర్శనం వ్రతమ్॥
ప్రదక్షిణం కృతం యేన తులసీ మునిసత్తమ।
కృతప్రదక్షిణ స్తేన విష్ణు స్స్వాత్మా న్న సంశయః॥

— మహాభాగవతము.

తులసినిదాఁకుటే స్నానము, తులసినిస్పర్శించుటే తపము. తులసీస్పర్శనమే ముక్తి. తులసీస్పర్శనమే వ్రతము. ఓ మునిసత్తమా! ఎవఁడు తులసికిఁ బ్రదక్షిణముచేయునో వాఁడు స్వయముగా విష్ణువునకే ప్రదక్షిణ మొనరించినవాఁడగు. ఈ సంబంధమున సంశయము లేదు. ఈ తులసిమహిమను వర్ణించుటకు నాకు శక్తి లేదు. శాస్త్రవాణి వినినచో, నావంటి గతిహీనునకుఁ దులసీసేవకంటె వేఱేయుపాయము లేదనితోఁచును. సాలగ్రామశిల, గంగ యేవిధముగాఁ బాపమును బోఁగొట్టునో తులసియును నావిధముగానే పాపుల పాపమును నశింపఁజేయును. నేనో క్షుద్రులకంటెను క్షుద్రుడను. స్వయముగా శ్రీ భగవానుడు సత్యభామతోఁ జెప్పినాఁడు :—

భగవత్యా తులస్యాస్తు మాహాత్మ్యామృతసాగరే।
లోభాత్ కర్తుమిచ్ఛామి క్షుద్ర స్తత్ క్షమ్యతాం త్వయా॥

— తులసీగీత.

భగవతియగు తులసియొక్క మాహాత్మ్యమనెడి యమృత సముద్రమునందలి యాశకు లోబడి క్షుద్రుఁడగు నేనందుఁ గ్రీడింప నుబలాటపడుచున్నాను. నన్ను క్షమింపుము. ఇది శ్రీ భగవానుని శ్రీముఖవాణి.

తులసీకాననం యత్ర యత్ర పద్మవనానిచ ।
పురాణపఠనం యత్ర తత్ర సన్నిహితో హరిః॥

ఎచట తులసి కాననము లుండునో, యెచట పద్మవనము లుండునో, యెచట పురాణపఠనము జరుగునో అచటనే శ్రీహరి స్థిమితముగా వాసము చేయును.

తులసీ రోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పావయేత్ ।
ఆరాధితా ప్రయత్నేన సర్వకామఫలప్రదా ॥ — తులసీగీతా

తులసిని నాటినను, తడిపినను, చూచినను, తాఁకినను, ఆరాధించినను సర్వకామముల నిచ్చును.

శిష్యు:— నాది తప్పుగాఁ బట్టుకొనకుంటిరేని యొకటి రెండు మాటలీ సంబంధమున నడుగవలెనని యున్నది. దయయుంచి నా సంశయమును నివారణచేయుఁడు.

గురు:— శాస్త్రసంబంధమున నీకే సంశయమున్నను జంకక యడుగుము.

శిష్యు:— చూడండి! తమరు తులసీ స్పర్శనమే స్నానమని, తపమని, ముక్తియని, వ్రతమని చెప్పితిరి. తులసిని నాటుట, చూచుట, తాఁకుటవలన సర్వకామములు సిద్ధించునంటిరి. తులసిచెట్టును సేవించినయెడల స్నానాదు లెట్లగును? జన్మజన్మాంతరములుగా నెన్నెన్నో సాధన లొనర్చిన దానికి ఫలముగా ముక్తినిబడయు సమర్థుఁడగుచున్నాఁడు. ఆ ముక్తి యేవిధముగా దానివలనఁ గలుగఁగలదు? నాకు బోధపడకున్నది. పాంచభౌతికవృక్షము తులసి. దీనిని సేవించిన మన సే ప్రకారము ముక్తినీయ సమర్థమగును? చెట్లు మున్నగువానిసేవ - క్రిందిమెట్టు సాధన కాదా? నాకుఁ జక్కఁగా బోధపడునట్లు చెప్పుఁడు.

గురు:— చూడు నాయనా! మనసేమో పాంచభౌతిక ద్రవ్యములకే కాచుచుండును. క్రింది మెట్టు వదలి పై మెట్టున కెట్లు మన స్సెగురఁ గలదు? అదియేమో క్రోఁతి వంటిది. ఈ కొమ్మమీఁది నుండి యా కొమ్మమీఁదికి దుముకుచుండును. రజోగుణ తమోగుణములందు మనస్సుంచుట పాపము కాక మఱేమి? స్నానము, తపస్సు, వ్రతము మున్నగు వానివలన మానవుని పాపములు క్షయించి పోవును. ఇది సత్యమా? పాప మన నేమి? రజోగుణ తమోగుణముల యందు మనస్సు నిలుచుట కాదా? పాపము క్షయించెనేని మనుష్యుఁడు సత్త్వగుణమును బడసి శుద్ధచిత్తుఁడగును. ఇది నిజమని యొప్పుకొనెదనా?

శిష్యుఁడు:— ఆజ్ఞ - దేవా!

గురు:— తులసి సత్త్వగుణముయొక్క సాక్షాన్మూర్తి. తులసీ పత్రమునందు, తులసికట్టెయందు, తులసి గంధమునందు, తులసి మొదలునందలి మట్టియందు సత్త్వగుణము నిశ్చలముగా నుండి యున్నది. ఆ తులసీసేవయందు స్నానము, తపస్సు, వ్రతము లేవా యేమి? తులసీ సేవయందలి మనస్సు సత్త్వగుణమున నిమజ్జితమగును. తులసీగంధము నాసికాపుటములగుండ లోపలఁ బ్రవేశించి లోపలి తమస్సును నశింపఁజేయును. తులసిచెట్టు పైనుండి వచ్చు పరిమళముతోడి గాలి వెలుపలి తమస్సును బోఁగొట్టును. శాస్త్రము లెక్కడ నసంగతములో చెప్పుము? ముక్తిని గుఱించి యడుగుచున్నాను. ముక్తి ఎన్ని ప్రకారములు?

శిష్యుఁడు:— తామే చెప్పుఁడు.

నము నలంకరించినవి. అస్ఫుట వచనములు నా కంఠము రుద్ధమైనది. ఈయవస్థలోనున్న నాకు రహస్యాంతరమైన నితర కార్యములచేత తీరిక లేదు. అయినను సాయుజ్యము, సార్ష్టి, సామీప్యము, సారూప్యము అను నాలుగువిధములైన ముక్తి సాధనలు నాపంచను పడిగాపులుపడి దాసీలవలె నాసేవచేయనుబలాటపడుచున్నవి. ఏమిది?

శిష్యుడు:- తమ శ్రీముఖసూక్తుల విని నాకు శ్రీ తులసీ దేవి మాహాత్మ్యము వినుట కిచ్ఛ పొడముచున్నది. తాము విస్తరముగా దానిని గీర్తన మొనరింపుఁడు. తులసి ఎవరు? ఎందువలన నామెకు వృక్షజన్మము వచ్చినది? ఎందుచేత శ్రీభగవానుఁ డామెనువీడి క్షణకాలమైనను నుండజాలడు? హరిప్రియ యగు నీ దేవి జన్మము కర్మము మొదలైనయితర ములగు వివరణములు సవిస్తారముగాఁ జెప్పుఁడు.

గురు:- వత్సా! నీ మాట విని విశేషముగ నానందించితిని. నీమీఁద నా ప్రాణేశ్వరుని కృపాదృష్టి కలదనుగాక. ఈ విషయమున నేమియు సంశయము లేదు. నీ వచిర కాలము ననే హరిభక్తి వడసి కృతార్థుఁడవు కాఁగలవు.

శిష్యు:- మీ యనుగ్రహ ముండినచో నేదియు నసంభవము కాదు. చెప్పుడు దేవా!

గురు:- వత్సా! శ్రీమతి తులసీదేవి మాహాత్మ్యము సవిస్తారముగాఁ జెప్పుటకు నాకు శక్తి లేదు. నాకు సాధ్యమైనంత వఱకుఁ జెప్పుటకుఁ బ్రయత్నించెదను. పురాణాది గ్రంథములం దీమె యుత్పత్తి యనేక ప్రకారములుగ వినుచున్నాము. శాస్త్రమందు విశ్వాసముగల భక్తులకా

విషయమున సందేహపడుట కేమియు లేదు. కల్పకల్పమున జన్మకర్మాదుల భేదము కొంచెమో నంచమో యుండును. కల్ప భేదమున లీలాభేద ముండును. ఇది తెలియఁజాలక విశ్వాసము లేనివారు శాస్త్రములను నమ్మఁజాలరు. ఒక శాస్త్రముతో మఱొక శాస్త్రమునకు విరోధమును గల్పన చేసి విపరీతమార్గమును బ్రోక్కుటచేఁ గ్లేశము కలుగును. శ్రీమద్దేవీభాగవతము అను గ్రంథమును మతాంతరమున మహాపురాణము చెప్పబడియున్నది. ఆ దేవీభాగవతము నందుఁ జూడనగును. ఈ తులసి శ్రీరాధికయొక్క యంశ సంభూత. ఆమెకు ప్రియతమసఖి, గోలోకవాసిని, శ్రీకృష్ణ సేవారతయగు గోపికగా నుండెను. సదా గోవిందుని సేవించుచుండెను. ఒక సమయమున నీయమ రాసమండలమున గోవిందునితో క్రీడాకౌతుకము ననుభవించుచు మూర్ఛవచ్చి పడిపోయెను. ఆ సమయమున రాసేశ్వరి యగు రాధ తక్షణమా తావునకు వచ్చి, యాస్థితిలో నున్న యా తులసి దశను జూచి, గోవిందుని నుల్లసమాడి, తులసిని పాపిష్టీ! నీవు మనుష్యయోనియందుఁ బుట్టుమని శాపమిచ్చెను. ఈ విధముగా రాధిక శపింపఁగా, గోవిందుఁడు తులసితో 'గోపికా! నీవు భారతదేశమున జన్మించి, తపస్సుచే బ్రహ్మను మెప్పించి, ఆ బ్రహ్మ వరమున నా యంశ సంభూతురాలవయి చతుర్భుజములతో విరాజిల్లెదవు గాత' యని పలికి యంతర్ధానము చెందెను. దేవియును భయమున దేహమును విడిచి భారతమున జన్మమును గ్రహించెను.

— దేవీభాగవతము ౯ స్కం. ౧౭ అ.

గురువు:— ముక్తి రెండు విధములు.

ముక్తిశ్చ ద్వివిధా సాధ్వి శ్రుత్యుక్తా సర్వ సమ్మతా।
నిర్వాణ పద దాత్రీ చ హరిభక్తిప్రదా నృణామ్॥

హరిభక్తి స్వరూపా చ ముక్తిర్వాంఛతి వైష్ణవాః।
అన్యే నిర్వాణ రూపాం చ ముక్తి మిచ్ఛంతి సాధవః॥

ఓ సాధ్వీ! వేదములందుఁ జెప్పఁబడినదియు, సర్వసమ్మత మైనదియు నయిన ముక్తి రెండు తెఱఁగులు. నిర్వాణ పద దాత్రియు, మానవునకు హరిభక్తి ప్రదాయినియు, హరిభక్తి స్వరూపిణియు నగు ముక్తిని వైష్ణవులు వాంఛించెదరు. తదితర సాధువులు నిర్వాణరూప యగు ముక్తి నభిలషించెదరు. శ్రీ తులసీదేవి యెప్పుడు హరిభక్తి నిచ్చునదయినదో యప్పుడు దానినేల ముక్తిదాత్రియని చెప్పరాదు? సాయుజ్యము, సార్ష్టి, సామీప్యము, సారూప్యము అను నాల్గుముక్తుల విషయములు వినుచున్నాము. భగవానుఁడు వాని నిచ్చెద ననినను భక్తులు వానిని గైకొన నొల్లరు. ఈ సంబంధమున శ్రీమన్మధుసూదన సరస్వతుల శ్లోక మొకటి మనస్సునకు వచ్చినది.

రోమాంచేన చమత్కృతా తను రియం భక్త్యా మనోనందితం
ప్రేమాశ్రూణి విభూషయంతి వదనం కంఠం గిరో గద్గదాః।
నాస్మాకం క్షణ మాత్ర మప్యవసరః కృష్ణార్చనం కుర్వతాం
ముక్తిర్ద్వారి చతుర్విధా పి కి మియం దాస్యాయలోలాయతే॥

— బోధసారము

నేను నిరంతరము కృష్ణార్చన మొనర్చుచుంటిని. నా శరీరమునఁ బులకలు పొడమి యంతరమున నొక విచిత్రానుభవము ప్రకటితమగుచున్నది. మనమున ప్రేమ భక్తివలని యానందముచేఁ బరిపూర్ణమయినది. ప్రేమాశ్రువులు నా వదన

శిష్యుడు:- ఎవరి కూఁతురుగా నీమె జన్మించినది ?

గురు:- ధర్మధ్వజుఁడను రాజునకు మాధవి యను పత్ని కలదు. ఆమె గర్భమున గార్తిక పూర్ణిమ తిథియందు, శుక్ర వారమునాఁ శుభక్షణమున, శుభదినమున, శుభలగ్నమున, శుభయోగమున బృందాదేవి జన్మించెను. పద్మినీజాతి లక్షణ ములుగల బృందయొక్క సౌందర్యమున కొక మేర లేదు. నర నారీగణమున నామె రూపముతోఁ దులన మొనరింపఁ జాలిన వారెవరును లేనందున పరమవేత్తలగు వారామెకు తులసి యని నామకరణము చేసిరి. తులసి భూమిమీఁద జన్మించిన మొదలు సమర్థురాలగు రమణివలె తపస్సు చేయుటకు బదరి కాశ్రమమునకుఁ బోయెను. ఎవరు వలదనినను వినినదికాదు. అట్లు చని, నారాయణుఁడు నాకు భర్తకావలెనని మనస్సు నందు సంకల్పించి, లక్ష దివ్య సంవత్సరములు కఠోరమగు తపము చేయసాగెను. ఎండకాలమున పంచాగ్ని మధ్యమున నుండియు, పుండువంటి చలికాలమున కుత్తుకబంటి నీటిలో నిలిచియు, జోరున కురియు వానకారున నారబయల వర్షా ధారల కోర్చియు ఘోరమైన తప మొనరించెను. ఇరువదివే లేఁడులు ఫలజలముల నాహారించియు, ముప్పదివేల సంవత్స లములు, రాలిన యాకులఁ దినియు, నలుబదివేల సంవత్సర ములు వాయు భక్షణము గావించియు, పదివేల వర్షముల నిరాహారిగా నుండియుఁ దపము గావించెను. ఇఁక బ్రహ్మ కుదురుగాఁ గూర్చుండఁజాలక, ఆమెకు వరము లిచ్చుటకు హంసవాహనారూఢుఁడయి బదరికాశ్రమమునకు వచ్చెను. తులసి, తనకు వరమీయఁ జనుదెంచిన వనజభవునిఁ గని, భక్తితోఁ బ్రణామ మొనరించి, కృతాంజలియయి, యీసం

దాశ్రువులు కనుల వెంట జడిగొన నిలఁబడినఁ దులసినిఁ జూచి, నలువ 'తులసీ! నేను నీ తపస్సునకుఁ బ్రీతుఁడ నయితిని. నీకు హరిభక్తియా లేక ముక్తియా కావలసినది? కోరు' మని యడిగెను. ఆమాటలను విని తులసి, 'దేవరవారు సర్వజ్ఞులరు. నా వృత్తాంత మంతయుఁ దమకుఁ దెలిసినదే. నేను గోలోకమున నుండుదానను. శ్రీ రాధికాంశమున మానవి నయి భారతమున జన్మించితిని. — నేను సుందరుఁడు, శాంతుఁడు నగు నారాయణుని స్వామిగాఁ బడయఁగోరుచున్నాను' అని విన్నవించెను. అంత బ్రహ్మ "తులసీ! శ్రీకృష్ణ శరీరోత్పన్నుఁడు, తదంశ స్వరూపుఁడు నయిన సుదాముఁడను గోపకుఁడు రాధిక శాపమున దైత్య దేహమును బడసి, శంఖచూడుఁడను పేరుతో జాతిస్మరుఁడయి దైత్యరూపమున రసాతలమున నున్నాఁడు. తొల్లి యతఁడు గోలోకమున నిన్నుఁజూచి కామపీడితుఁ డయ్యెను, రాధికకు వెఱచి నిన్ను బొందఁజాలడయ్యెను. నీవును జాతిస్మరవు. సర్వ మీ వెఱుఁగుదువు నీ వాతనికిఁ బత్నివి కమ్ము — అనంతరము నీవు నారాయణుని భర్తగాఁ బడయఁ గలిగెదవు. దైవయోగమున నారాయణుని కృపచే నంశరూపమున విశ్వపావని వగు వృక్షరూపమును బడసెదవు. నీవు సకలపుష్పముల కంటెఁ బ్రధానవయి, విష్ణునకుఁ బ్రాణాధిక వయ్యెదవు. నీకంటె వేఱయిన యితర దేవతల పూజయంతయు నిష్ఫలమే యగును. బృందావనమున బృందావనీ రూపమున నుండఁ గలవు. గోప రూపధారియగు శ్రీకృష్ణునితో నా వరముచే వృక్షముల కధిష్ఠాత్రివయి దేవిరూపమునఁ గ్రీడించెదవు." అని బ్రహ్మ చెప్పెను. ఆ మాటలను విని తులసీదేవి "నేను

శ్యామసుందరుఁడు ద్విభుజుఁడగు శ్రీకృష్ణునే యభిలషించు చున్నాను. చతుర్భుజరూపుని గాదు. ఇప్పుడు గోవిందుని వాక్యానుసారముగానే నేను నారాయణునిఁ బ్రార్థన చేయు చుంటిని. మీ ప్రసాదమున గోవిందుని మరలఁ బడయఁ గలి గెదనేని, ముందుగా రాధవలనఁ గలుగు భయమును నివారణ చేయుఁడు." అని బ్రహ్మను బ్రార్థించెను.

"రాధికాషోడశాక్షరమంత్రము నిచ్చెదను గ్రహింపుము. నా వరము వలన నీవు రాధికకుఁ బ్రాణతుల్య వయ్యెదవు. అంతియే. రాధికయే నీకు గోపనీయక్రీడావిషయమున ననుమతి యీయఁగలదు. నీవు గోవిందుని సమీపమున రాధికవలె నాదరింపబడఁగలవు." అని చెప్పి, జగద్యోనియగు బ్రహ్మ తులసికి రాధికాషోడశాక్షరమంత్రమును, స్తవము, కవచము పూజావిధానము సమస్తము పురశ్చరణ క్రమము తులసి కుపదేశించి, యాశీర్వదించి, యంతర్హితుఁడయ్యె. తులసీదేవి యథాక్రమముగా సిద్ధమంత్రమును బడసి, పూజా పురశ్చర ణాదులవలన సిద్ధి వడసి, లక్ష్మివలె నుండఁజొచ్చెను.

శిష్యుడు:- అటుపిమ్మట నెట్లు శంఖచూడునితోఁ గూడెను ?

గురు:- మహాయోగి యగు శంఖచూడుఁడు జైగీషవ్యముని యొద్ద కృష్ణమంత్రము నుపదేశమును బొంది, పుష్కర తీర్థమునకుఁబోయి యందు జపముచేయుచుండెను. మంత్ర సిద్ధి కలిగెను. సర్వమంగళ కవచమును ధరించి, బ్రహ్మ యొద్ద వరములనుబడసి, యాబ్రహ్మయానతి బదరికాశ్రమ మునకుఁ బోయెను. అక్కడ తులసిని శంఖచూడుఁడు చూచెను. ఇరువురు జాతిస్మరులు. అనఁగాఁ బూర్వజన్మ

జ్ఞానము కలవారు. శంఖచూడుఁడు గోలోకమందలి విష యము చెప్పెను. ఒకరి నొకరు తెలిసికొనిరి. అప్పుడక్కడ బ్రహ్మ వచ్చి, శంఖచూడునితో 'శంఖచూడా! నీవు తులసిని గాంధర్వవివాహక్రమమునఁ బాణిగ్రహణ మొన రింపుము' అని చెప్పెను. అంత శంఖచూడుఁడు బ్రహ్మ యాదేశము ననుసరించి తులసిని గాంధర్వ వివాహవిధిని బెండ్లాడెను. దేవదుందుభులు మ్రోగెను. పూలవాన గురిసెను.

శిష్యుడు:- మి మ్మొక విషయము నడుగవలెనని యున్నది.

గురు:- సంకోచ మెందుకు? అడుగు.

శిష్యుడు:- చూడండి! ఈ పురాణములందలి విషయములు కల్పితములని తలఁచెదను. తులసి లక్ష దివ్యసంవత్సరములు తపసుచేసినదఁట. ఎట్లు నమ్మవచ్చును? ఇఁక శాస్త్రము చెప్పుచున్నదని గట్టిగా నమ్మవలె. శాస్త్రవిశ్వాసము లేనివారు కట్టుకతలని యుపేక్షించెదరు.

గురు:- వత్సా! గురువుల మాటయందు, శాస్త్రవాక్యము నందుఁ గల విశ్వాసమే శ్రద్ధ. ఆ శ్రద్ధ దైవీసంపద. నేఁటి యాసురీభావముకల నరనారీ జనములు వీని నమ్మరు. అణిమాదులయిన యైశ్వర్యమును యోగులు పడయఁ గలరు. ఆకాశగమనము, వ్రేలితోఁ జంద్రునిఁ దాఁకుట, ఈశిత్వము, వశిత్వము మున్నగు యోగసిద్ధుల విషయమున లోకులకు నమ్మకము కలిగించుట దుర్లభమైనది. పురాణ ములను అశ్రద్ధచక్షులతోఁ జూచెదరనుటలో నేమి యాశ్చ ర్యము? ఇఁక నిది జ్ఞాపకముంచుకొనుము. మూఁడు విధ

ములగు భాషలు తెలియనివాఁడు పురాణములయు, శాస్త్రములయు మర్మము తెలియఁజాలఁడని బుద్ధిమంతులందురు. పురాణములలో సమాధిభాష, లౌకికభాష, కావ్యభాషయను మూఁడు భాషలున్నవి. ఈ త్రివిధభాషలందుఁ బండితులయినవారే పురాణములందలి యథార్థభావమును గ్రహింపఁగలరు. తెలిసినదా?

శిష్యుఁడు:- వర్ణనాతిశయము కలిగిన తావునందే కావ్యభాష మంచిది. తాము చెప్పుఁడు. నేను శాస్త్రములందు దృఢమగు శ్రద్ధకలవాఁడ నగునట్లును, శాస్త్రమునందలి ప్రతి విషయము సత్యము అనునది మఱవకుండునట్లును ఆశీర్వదింపుఁడు.

గురు:- నాయనా! శాస్త్రశ్రద్ధ లభించెనా, లక్ష్యము సత్వరముగాఁ గలుగఁగలదు. ఔను! అనంతరము శంఖచూడుఁడు. తులసితోఁ దన యాశ్రమమున కేగి, దివ్య క్రీడాభవనములందు రమణీమణులతోఁ గూడి క్రీడింప సాగెను. బాహుబలమున దేవ, దానవ గంధర్వాదుల నెల్లరఁ బరాజితులఁగావించి, రాజరాజేశ్వరుఁడయి, సుఖముగా నొక మన్వంతరకాలము రాజ్యము చేసెను. అధికార చ్యుతులయిన దేవతలు బ్రహ్మయొద్దకుఁ బోయి, శరణాగతులైరి. తమ దుర్దశను గుఱించి నివేదించుకొనిరి. బ్రహ్మ శివుని భవనమునకుఁబోయి విషయ మంతయుఁ జెప్పెను. మహేశ్వరుఁడును బ్రహ్మాది దేవగణములతో వైకుంఠమునకుఁబోయి కిరీటకుండల వనమాలాలంకృతుఁడును, సర్వాంగ చందనసిక్తుఁడును నగు శ్రీహరి కరకమలమునఁ గ్రీడాపద్మమును ధరించి యుండుటఁ గాంచెను.

లక్ష్మీదేవి మడుపు లందిచ్చుచుండెను. గంగాదేవి పరమ భక్తితో శ్వేతచామరము వీచుచుండెను. భక్తగణములు భక్తి వినమ్ర మస్తకులయి నిరంతరము స్తోత్రపాఠము లొనరించు చుండిరి.

అట్టి మనోహరరూప దర్శనమున దేవతల శరీరములు గోమాంచితము లయ్యెను. నేత్రములనుండి ప్రేమాశ్రువులు వెడలఁజొచ్చెను. వారు భక్తితోఁ బ్రణామముగావించి, నారాయణుని స్తోత్ర మొనరించిరి. బ్రహ్మ వృత్తాంతమంతయు విన్నవింప, శ్రీభగవానుఁడు నవ్వి, "పద్మజా! శంఖచూడుని కథ యంతయు నాకుఁ దెలియును. వాఁడు పూర్వజన్మమున సుదాముఁడను గోపకుఁడు. నాకుఁ బరమ భక్తుఁడు. రాధిక శాపమున దానవుఁడయి పుట్టెను. రాధిక కృపాపరవశయయి 'క్షణార్ధము శాప మనుభవింపు' మని పలికెను. గోలోకమున క్షణార్ధము భూలోకమున నొక మన్వంతరమైనది. ఆ శాపము తీఱినది. వాఁడిఁక గోలోకమునకుఁ బోవఁగలఁడు. ఇదిగో! ఈ త్రిశూలమును గొని మహేశ్వరుఁడు వానిని సంహరింపఁ గలఁడు. శంఖచూడుని కంఠమున నా సర్వమంగళ కవచ మున్నది. అది వాని కంఠమున నున్నంతవఱకు వాని నెవ్వడును చంపఁజాలఁడు. బ్రహ్మవరమున వాని పత్ని పతివ్రతగా నున్నంతవఱకు వాని నెవ్వఁడును వధింప సమర్థుఁడు గాఁడు. నేను బ్రాహ్మణరూపమున వానియొద్దకుఁ బోయి వాని కంఠము నందున్న కవచమును తీసికొనెదను. శంఖచూడుని రూపు దాలిచి తులసియొక్క సతీత్వమును చెడఁగొట్టెదను. అప్పుడు వాఁడు నిహతుఁడగును. తులసి దేహమును వదలి నాకుఁ బ్రియురాలగును." అని నారాయణుఁడు బ్రహ్మకు దెలిపెను.

దేవతాగణము శ్రీహరి వాక్యానుసారము శూలమును గ్రహించి స్వస్థానమునకుఁ బోయెను. శ్రీభగవానుఁడు వృద్ధ బ్రాహ్మణ దేహమును పరిగ్రహించి శంఖచూడుని దగ్గఱకుఁ బోయి, కవచమునిమ్మని ప్రార్థించెను. విష్ణుమాయచే శంఖ చూడుఁడయి, గళమున సర్వమంగళకవచమును ధరించి, రణ రంగమునుండి గృహమునకు వచ్చి, 'బ్రహ్మ యాజ్ఞచే దేవ గణములకు వారి వారి పూర్వాధికారముల నిచ్చితిని' అని చెప్పెను. దేవతలు వారివారి తావులకుఁ బోయిరి. తరువాత శ్రీ భగవాను తులసియొక్క పాతివ్రత్యమును భంగ మొన రించెను. తులసి యతఁడు శంఖచూడుఁ డు కాఁడని తెలిసి కొనెను. అంత తులసి 'నీవు మాయాబలమున నన్ను పభోగించి నా పాతివ్రత్యమును నాశ మొనర్చితివా? నీ విట్లే యుందువు గాక!' అని శాపమిచ్చెద ననెను. శ్రీహరి శాపభయమున తత్క్షణము నవనీరదశ్యామమూర్తి ధరించెను. (భగవంతుఁడును పతివ్రత లకు భయపడును.) తులసి యా హరినిజూచి మూర్ఛిల్లెను. తరువాతఁ గొంతవడికి తెలిసి 'నాథా! నీకు దయ లేదు. నీవు పాషాణమువంటి కఠిన హృదయుఁడవు. కపటముగా ధర్మ మును జెఱచి నా పతిని జంపితివి. నీవు ఆత్మసుఖము చూచెడివాఁడవు. కావున నీ వీలోకమున శిలారూపి వయ్యెదవు. నీవు పరుల కొఱకు నీ భక్తుని వినాశ మొనర్చితివి. నీవు సర్వజ్ఞుడవు, సర్వా త్మవు నయ్యును పరుల దుఃఖమును తెలియకుంటివి. కావున నీ కొక జన్మమున నాత్మవిస్మృతి కలుగునుగాక!' యని పలికి, తులసి భగవానుని పాదములమీఁద వ్రాలి, జాలిగొలుపు ధ్వనితో మిక్కిలి రోదనముగావింపఁదొడఁగెను. భగవానుఁడు తులసి నోదార్చుచు 'ఓ సాధ్వీ! నన్ను స్వామిగాఁ బడయఁ

గోరి బహుకాలమున నీవు భారతమునఁ దపము గావించితివి. శంఖచూడుఁడును నిన్ను పత్నిగాఁ బడయఁగోరి బహువత్సరములు తపస్సుచేసి, తపఃఫలముగా నిన్ను భార్యగాఁ బడయఁ గలిగెను. నేనును మీతపమునకు మెచ్చి వరమిచ్చితిని. నీవీ దేహమును వదలి దివ్యదేహముధరించి నాతో విహరింపుము. నీయీ దేహమున భారతదేశమున గండకియను ప్రసిద్ధిగల పుణ్యనది యయ్యెదవుగాక. నీకేశకలాపము తులసీకేశ సంభూతము గనుక తులసి యనుపేర విఖ్యాతివహించి పవిత్రవృక్షరూపమును ధరించెదవుగాక. అన్ని పత్రములపూలకంటె నీతులసి దేవపూజకు ప్రశస్తమగును. త్రిలోకములందును వైకుంఠమునందును నీతులసి సమస్తపుష్పములకంటె శ్రేష్ఠమైనది కాఁగలదు ఈ పవిత్ర తులసీవృక్షము – గోలోకమున, విరజాతటమున, రాసమండలమున, బృందావనమున, భాండీరవనమున, మనోరమ చంపకవనమున, చందనకాననమున, మాధవీ, కేతకీ, కుంద, మాలతీవనములందు, నితర సమస్తపుణ్యభూములందు నుత్పన్నము కాఁగలదు. తులసి మొదట రాలిన తులసియాకులం దంతట దేవతలు నివాసము చేయుదురు. ఎవఁడు తులసీపత్ర జలమున స్నానము చేయునో వాఁడు సర్వతీర్థస్నానఫలము, సమస్తయజ్ఞ దీక్షల ఫలము పొందును.

అమృతపూర్ణములగు వేయి కుంభములు దానముచేసినను, ఒక తులసీపత్రదానము వలనఁ గలిగినతృప్తి నాకుఁ గలుగదు. కార్తికమాసమున నొక తులసీపత్రదానము పదివేల గోదానములకు తుల్యము. మరణకాలమునఁ దులసితీర్థము ప్రాప్తించిన వాఁడు విష్ణులోకమునకుఁ బోవును. ప్రత్యహము తులసితీర్థ పానము చేయు మానవునకు నిశ్చయముగా అశ్వమేధయజ్ఞ

పుణ్యము లభించును. హస్తమునందు, దేహమునందు తులసి ధరించినవాఁడు దేహమును వదలిన - వానికి తీర్థమరణ ఫలము కలిగి, విష్ణులోకప్రాప్తి యగును. తులసికట్టెతోఁ జేసిన మాలను ధరించినవానికి అడుగడుగున కశ్వమేధఫలము లభించును. ఏ వ్యక్తి హస్తమున తులసిధారణచేయ నంగీకరింపఁడో వాఁడు సూర్యచంద్రు లున్నంతవఱకు కాలసూత్రనరకము నుండి తప్పించుకొనఁజాలఁడు. ఏ మానవుడు హస్తమునఁ దులసి పట్టుకొని యసత్యప్రమాణము చేయునో వాఁడు పదునలుగు రింద్రు లుండునంతకాలము కుంభీపాకమున నివాసముచేయును. వేయేల! ఏవ్యక్తికి మృత్యుకాలమున తులసీతీర్థకణములభించెనేని వాడు మణిమయవిమాన మెక్కి వైకుంఠమునకుఁ బోవును. ఎవరు పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి, సంక్రాంతి దినములందును, తైలాభ్యంగనముచేసి స్నానముచేయుసమయమున, మధ్యాహ్న కాలమున, రాత్రివేళ, ఉభయసంధ్యల యందు, ఆశౌచమునందు, అపవిత్ర దశయందు తులసిని కోయుదురో వారు హరి శిరచ్ఛేదనము చేసినవారయ్యెదరు. ఓ సతీ! మూఁడుదినముల క్రింద సంగ్రహించినదయ్యును అది శ్రాద్ధ వ్రత దాన దేవపూజాది కార్యములందు శుద్ధమైనదే. విష్ణునుద్దేశించి సమర్పించిన తులసీపత్రము మృత్తికయందు లేక జలమునందు పడినదయినను కడిగినచో, నితర కార్యము లందుపయోగించుటకు శుద్ధమైనదగును. వృక్షముల కధిష్ఠాత్రి యగు దేవి యెవరో, యామె గోలోకమున నిర్జనప్రదేశమున శ్రీకృష్ణునితోఁ గ్రీడసలుపుచుండును. మఱియు భారతమున పుణ్యప్రదయగునదియే మదంశసంభూతలవణసముద్రునికిఁ బత్నియయ్యెను. మఱియు, మహాసాధ్వీ! స్వయముగా నీవు

వైకుంఠమున నాయొద్ద లక్ష్మితో సమానమయ్యెదవు. నేనును నీశాపమువలన భారతమున గండకీనదీతీరమున శిలారూపినయి యధిష్ఠించెదను. అచ్చోట తీక్ష్ణదంతవిశిష్టకీటకము నాలోపలఁ జేరి చక్రముల రచించును. లక్ష్మినారాయణ, లక్ష్మిజనార్దన, రఘునాథ, వామన, శ్రీధర, దామోదర, రణరామ, రాజ రాజేశ్వర, వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ, అనంత, మధుసూదన, సుదర్శన, గదాధర, హయగ్రీవ, నరసింహ ప్రభృతుల నామములతో చక్రములు, ఆకృతులు, చిహ్నభేద ముల నేను బహునాముఁడ నయ్యెదను. ఎచ్చట సాలగ్రామశిల యుండునో అచ్చట సమస్తతీర్థములతో నేను లక్ష్మియందు వాసము చేయుదును. దాన, యజ్ఞ, తపో, వ్రత, తీర్థ, గమనాది పుణ్యకర్మముల ఫల మొక సాలగ్రామ పూజవలన లభించును. సాలగ్రామపూజ చేయువాఁడు జీవన్ముక్తుఁడు, మహాపవిత్రుఁడు నగును. సాలగ్రామశిలయుండి తులసి లేనిచో జన్మజన్మాంతర ముల భార్యావిచ్ఛేదము కలుగును. శంఖముండి తులసి విచ్ఛిన్న మయ్యేనేని ఏడుజన్మములు భార్యావిహీనుఁడును, రోగియు నగును. ఏమహాజ్ఞానియగువ్యక్తి తులసి శంఖము సాలగ్రామ మొకచోటనుంచునో యతఁడు నాకుఁ బ్రియుఁడగును' అని శ్రీహరి తులసి కిట్లు చెప్పి విరమించెను. తులసి దేహమువిడిచి వైకుంఠమున కేగి, లక్ష్మి, సరస్వతి, గంగలవలె హరికిఁ బ్రియు రాలయ్యెను. ఆయమ దేహము గండకియను పేర నదియయ్యెను. దానితీరమున హరియంశమున మానవులకు బుణ్యమునొసఁగు నొక పర్వతము పుట్టెను. ఆ పర్వతమునం దాకీటకము బహు ప్రకారములగు శిలల నిర్మించుచుండెను. వింటివా! వత్సా!

శిష్యుఁడు:— దేవా! తమ శ్రీముఖమునుండి తులసీదేవియొక్క యపూర్వవ్యాఖ్యానము విని యత్యంతానందము నందితిని.

గురు:— రోమాంచము, అశ్రువులు మున్నగునవి సాత్త్వికభావ వికారములు. వీనివలన భగవత్స్పర్శ కలిగినదని తెలియుము. ఇవి యెంతస్థాయిచెందునో అంత భావము వృద్ధి యగును. ఆ స్థాయీభావమే సమాధిని కలిగించును.

శిష్యుఁడు:— బృందాదేవికథ యింకను జెప్పుఁడు.

గురు:— తులసి వైకుంఠమునకేగి లక్ష్మీదేవివలె సౌభాగ్య శాలినియు, గౌరవాన్వితయు నయ్యెను. గంగయు, రమయు సహించిరిగాని, సరస్వతి కోపవశమున తులసి యొక్క సౌభాగ్యగౌరవములు చూచి యోరువఁజాలదయ్యెను. ఒకప్పుడు మానిని యగు సరస్వతి హరియెదుర తులసితో వృథాకలహమునకు దిగెను. ఆదెబ్బకు తులసి లజ్జావమాన ములచే నంతర్హితయయ్యెను. సర్వసిద్ధేశ్వరియు యైన తులసి హరికి కానరాదయ్యెను. శ్రీహరి స్వాంతనపూర్వకముగ సరస్వతి యనుజ్ఞవడసి, తులసీవనమునకుఁబోయి, స్నానాంతమున తులసితో తులసి ధ్యాన పూజాదు లొనరించి, లక్ష్మీబీజ, మాయాబీజ, కామబీజ, వాణీబీజాది దశాక్షర మంత్రమును భక్తితో స్తవమొనర్చెను.

'శ్రీం, హ్రీం, క్లీం, ఐం - బృందావనీ స్వాహా'

ఎవఁ డీ మంత్రముతో తులసిని ఘృత దీప, ధూప, సిందూర, చందన, పుష్పనైవేద్యాద్యుపహారములతోఁ బూజచేయునో వాఁడు సర్వసిద్ధులు పడయ సమర్థుఁడగును.

పిమ్మట శ్రీహరి స్తవమొనర్చెను. హరిచేసిన స్తవముచే సంతుష్టయై తులసి వృక్షమునుండి యావిర్భవించి శ్రీహరిని శరణుజొచ్చెను. హరి యామెను 'జగత్పూజ్యవుక'మ్మని వరమొసంగి మఱియు నేను నిన్ను మస్తకమున, వక్షమున ధరించెదను. ఆ కారణమున సమస్త దేవతాగణములు నిన్ను మస్తకమున, వక్షమున ధరించెద'రని పలికెను. అటుపిమ్మట శ్రీహరి తులసినిఁ దీసికొని తన యాలయమునకుఁ బోయెను.

శిష్యుడు:- హరి యొనరించిన తులసీ స్తవమును జెప్పుడు.

గురు:- శ్రీ భగవా నువాచ.

బృందారూపాశ్చ వృక్షాశ్చ యదైకత్ర భవంతి చ।
విదు ర్బుధా స్తేన బృందాం మత్ప్రియాం తాం భజామ్యహమ్॥

పురా బభూవ యా దేవీ త్వాదౌ బృందావనేవనే।
తేన బృందావనాఖ్యాతం సౌభాగ్యాం తాం భజామ్యహమ్॥

అసంఖ్యేషు చ విశ్వేషు పూజితా యా నిరంతరమ్।
తేన విశ్వపూజితాఖ్యా పూజితాం చ భజామ్యహమ్॥

అసంఖ్యానిచ విశ్వాని పవిత్రాని త్వయా సదా।
తాం విశ్వపావనీం దేవీం విరహేన స్మరామ్యహమ్॥

దేవా న తుష్టాః పుష్పాణాం సమూహేన యయా వినా।
తాం పుష్పసారాం శ్రద్ధాం చ ద్రష్టు మిచ్ఛామి శోకతః॥

విశ్వే యత్ ప్రాప్తిమాత్రేన భక్తానంద భవే ద్ధ్రువమ్।
నందినీ తేన విఖ్యాతా సా ప్రీతా భవతాదిహా॥

యస్యా దేవ్యా స్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషుచ।
తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియామ్॥

కృష్ణజీవనరూపా సా శశ్వత్ ప్రియతమా సతీ।
తేన కృష్ణజీవనీ సా సా మే రక్షతు జీవనమ్॥

శ్రీహరి యీవిధముగా స్తవాదు లొనరించి తులసిని దీసికొని వైకుంఠమునకుఁ బోయెను. లక్ష్మి గంగా సరస్వతులు, ఎల్లరు ఆదరమున గ్రహించిరి.

ఎవఁడు తులసిని బూజించి బృందా, బృందావని, విశ్వ పావనీ, విశ్వపూజితా, పుష్పసారా, నందినీ, తులసీ, కృష్ణజీవనీ యీ సార్థకమగు నామాష్టకరూపస్తోత్రమును జేయునో వాఁడు అశ్వమేధ ఫలభాగియగును. కార్తికపూర్ణిమనాఁడు జగన్మంగళ కారిణియగు తులసి జన్మించెను. అందువలన నానాఁడు శ్రీహరి యామె పూజావిధానమును చేసెను. ఎవఁ డా దినమున విశ్వ పావనియగు తులసిని బూజించునో వాఁడు సమస్తపాపములు పోయి విష్ణులోకమునకుఁ బోవును.

కార్తికమాసమున విష్ణు నుద్దేశించి తులసీదానము చేసిన పదివేల గోదానముల ఫలము కలుగును. వేయేల? తులసీ స్తోత్ర స్మరణమాత్రమున పుత్రహీనుఁడు పుత్రుని, ప్రియా హీనుఁడు ప్రియను, బంధుహీనుఁడగు వ్యక్తి బంధువులను బడయును. రోగి రోగమునుండి, బద్ధుడు బంధనమునుండి, భీతుడు భయమునుండి, పాతకుడు పాపమునుండి ముక్తుఁడగును. పాపనాశనమగు తులసి ధ్యానమును శ్రవణము చేయుము. సతీతులసి-పుష్పసారపూజ్య, మనోహర. ఆమె ప్రజ్వలితాగ్ని శిఖవలె సమస్తపాపముల నెడి కట్టెలను దహించును. మునీ! సమస్త దేవతా స్త్రీలలోఁ బవిత్రురాలు. పుష్పములలో నామెతో సాటియైనది లేదు. ఆమె తులసియను పేరఁ గీర్తింపఁ బడును. ఎల్లరచేతఁ బ్రార్థనీయ, శిరోధార్య. ఆమె విశ్వపావనీ నామమునఁ బ్రసిద్ధురాలు. ఆమె ముక్తిని, హరిభక్తిని నొసఁ గును. జీవన్ముక్తయగు తులసిని భజించుచున్నాను.

వత్సా! శ్రీదేవి భాగమునుండి సారమును దీసి నీకీ తులసి మహిమను గీర్తనము చేసినాను.

శిష్యుఁడు:- నేను గృతార్థుఁడనైతిని. శ్రీశ్రీ హరిభక్తిదాయినీ బృందాదేవి చరణముల కోటికోటి యేటికోళ్లు సమర్పించు చున్నాను.

గురు:- "బృందాయై తులసీదేవ్యై ప్రియాయై కేశవస్యచ" అని ప్రణామము చేయును.



# ద్వితీయ ప్రకాశము

శిష్యు:- దేవా! నాకు తులసీదేవి మాహాత్మ్య మింకను జెప్పుఁడు.

గురు:- దీర్ఘాయుష్మంతుడవు కమ్ము. హరిభక్తిప్రదాయిని యొక్క కథామృతము పానమొనర్చి యచిర కాలమున హరిభక్తిబడసి కృతార్థుఁడ వయ్యెదవు. ఇప్పుడు నీకు "తులసీగీత" వచించెదను వినుము. శ్రీ భగవానుఁడగు గోవిందుఁడు సత్యభామ కిట్లు చెప్పెను.

శ్రీ భగవానువాచ.

> ప్రాగర్ఘ్యం తతోభ్యర్చ్య గంధపుష్పాక్షతాదిభిః ।
> స్తుత్వా భగవతీం తాం చ ప్రణమే దండవద్భువి ॥ ౧

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

సత్యభామా! నీవు తులసీదేవికిఁ బ్రథమమున నర్ఘ్యమిచ్చి, గంధ పుష్పాక్షతాదులతో 'బూజించి' స్తోత్ర మొనర్చి, తులసీ భగవతికిఁ బ్రణామ మొనరింపుము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారు బ్రహ్మ చారి గృహస్థ, వానప్రస్థ, యతి ఆశ్రమములవారు, స్త్రీలు, పురుషులు తులసిని బూజించిన యిష్టఫలముల నొసఁగును.

తులసీ రోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పావయేత్
ఆరాధితా ప్రయత్నేన సర్వకామ ఫలప్రదా॥ ౧౧

నాఁటినను, నీరుపోసినను, చూచినను, తాఁకినను తులసి పావనులఁ జేయును. శ్రద్ధతో నారాధించిన కోరినఫలముల నెల్ల నిచ్చును.

ప్రదక్షిణం భ్రమిత్వా యే నమస్కుర్వంతి నిత్యశః।
న తేషాం దురితం కించి దక్షీణ మవశిష్యతే॥ ౧౨

నిత్యము ప్రదక్షిణముచేసి నమస్కారము సమర్పించిన వారికిఁ గొంచమేని పాపము మిగిలియుండదు. అనఁగా పాప మంతయు నశించిపోవును.

పూజ్యమానా చ తులసీ యస్య వేశ్మని తిష్ఠతి।
తస్య సర్వాని శ్రేయాంసి వర్ధంతేఽహరహః సదా॥ ౧౩

ఎవనిగృహమునఁ దులసి పూజింపఁబడుచుండునో, వానికి సమస్తశ్రేయస్సులుప్రత్యహముసర్వదావృద్ధిపొందుచుండును.

పక్షే పక్షే చ ద్వాదశ్యాం సంప్రాప్తేతు హరేర్దినే।
బ్రహ్మాదయోఽపి కుర్వంతి తులసీవనపూజనమ్॥ ౧౪

ప్రతిపక్షమున ద్వాదశీతిథియందు, హరివాసరమున బ్రహ్మాది దేవతలును తులసీవనమును బూజింతురు.

అనన్యమనసా నిత్యం తులసీం స్తౌతియోజనః।
పితృదేవ మనుష్యాణాం ప్రియో భవతి సర్వదా॥ ౧౫

అనన్యమగు మనస్సుతో నిత్యము తులసిని స్తోత్రముచేయు వాఁడుపితరులకు, దేవతలకు, మనుష్యులకుసర్వదాప్రియుఁడగును.

రతిం బధ్నామి నాన్యత్ర తులసీకాననం వినా।
సత్యం బ్రవీమి తే సత్యే కలికాలే మమ ప్రియే॥ ౧౮

ప్రియా! సత్యభామా! నీకు నిజము చెప్పుచున్నాను. కలికాలమున తులసీకాననముకంటె వేఱొకచోట నేను ప్రీతిఁగలవాడను కాను.

హిత్వా తీర్థ సహస్రాణి సర్వానపి శిలోచ్చయాన్।
తులసీకాననే నిత్యం కలౌతిష్ఠామి భామిని॥ ౧౯

భామినీ! వేలతీర్థములను, పుణ్యపర్వతములను వదలి కలియుగమున తులసీకాననమున నిత్యనివాసము చేయుదును.

న ధాత్రీ సఫలా యత్ర న విష్ణు స్తులసీవనమ్।
తత్ శ్మశానసమం స్థానం సంతి యత్ర న వైష్ణవాః॥ ౧౭

ఎచట ఫలవిశిష్టమగు నుసిరిక లేదో, యెచ్చట విష్ణువు – తులసీవనము లేవో, యెచట వైష్ణవులు లేరో యది శ్మశానమే.

తులసీగంధ మాదాయ యత్ర గచ్ఛతి మారుతః।
దిశో దశ చ పూతాః స్యు ర్భూత గ్రామా శ్చతుర్దశః॥ ౧౯

తులసీగంధము (వాసన) తోఁగూడి వాయువెచట వీచునో యచట దశదిశలు, చతుర్దశ భూతసమూహములు పవిత్రములగును.

తులసీ వన సంభూతా ఛాయా పతతి యత్ర వై।
తత్ర శ్రాద్ధం ప్రదాతవ్యం పితౄణాం తృప్తిహేతవే॥ ౨౦

తులసి చెట్లమీఁదినుండి వచ్చు నీడ యెచట పడునో, పితృదేవతల తృప్తికొఱకు శ్రాద్ధ మచ్చోట బెట్టవలెను.

తులసీ పూజితా నిత్యం సేవితా రోపితా శుభా।
తులసీ స్థాపితా యైస్తు తే వసంతి మమాలయే॥ ౨౧

ఎవరు నిత్యము శుభములొసంగు తులసిని బూజింతురో సేవింతురో, నాటెదరో, స్నానము చేయించెదరో వారు నా లోకమున వాసము చేయుదురు.

సర్వపాపహరం సర్వ కామదం తులసీవనమ్ ।
న పశ్యతి యమం సత్యే తులసీవనరోపణాత్ ॥ ౨౨

తులసీవనము సర్వపాపములను పోఁగొట్టును. సర్వకామముల నొసఁగును; తులసీవనము వేసినవారు యముని చూడరు.

తులస్యలంకృతా యే వై తులసీవన పూజకాః ।
తులసీ స్నాపకా యే చ తే త్యాజ్యా యమకింకరైః ॥ ౨౩

ఎవరు తులసి నలంకరించెదరో, యెవరు తులసీవనమును బూజించెదరో, యెవరు స్నానము చేయించెదరో వారు యమ కింకరులచే విడువఁ బడుదురు.

దర్శనం నర్మదాయాంతు గంగాస్నానం కలౌయుగే।
తులసీదళసంస్పర్శః సమ మేత త్త్రియం స్మృతమ్॥ ౨౪

నర్మదా దర్శనము, గంగాస్నానము, తులసీదళస్పర్శనము కలియుగమునం దీమూఁడు సమానముగాఁ బుణ్యము నిచ్చున వని చెప్పఁబడినది.

దారిద్ర్యదుఃఖరోగార్తి పాపాని సుబహూన్యపి।
హరతే తులసీక్షేత్రం రోగానివ హరీతకీ॥ ౨౫

కరక్కాయ రోగముల నన్నిటిని నెట్లు పోఁగొట్టునో, యట్లే దారిద్ర్యమును, దుఃఖమును, రోగమును, శోకమును బహుప్రకారములైన పాపములను తులసీక్షేత్రము హరించును.

తులసీకాననే యస్తు ముహూర్త మపి విశ్రమేత్।
జన్మకోటికృతాత్పాపాత్ ముచ్యతే నాత్ర సంశయః॥ ౨౬

ఎవఁడు ముహూర్తకాలమయినను తులసీకాననమునందు విశ్రమించెనేని, వాఁడు కోటిజన్మములందుఁ జేసిన పాపముల నుండి విముక్తుఁడగును. ఇందుకు సందియము లేదు.

నిత్యం తులసీకాననస్యే తిష్ఠామి స్పృహయా యుతః।
అపి మే క్షతపత్రైకం కశ్చిద్ ధన్యోఽర్పయేదితి॥ ౨౭

ఏ భాగ్యశాలియైన వ్యక్తియయినను నాకొక చినిఁగిన తులసియాకొకటియైన అర్పింపకుండునా యనెడి అభిలాషతో నిత్యము తులసివనమున సస్పృహుఁడనై వసించుచున్నాను.

తులసీనామ యో బ్రూయాత్ త్రికాలం వదనే నరః।
వివర్ణవదనో భూత్వా తల్లిపిం మార్జయేద్యమః॥ ౨౮

ఏ వ్యక్తి త్రికాలములందు 'తులసీ' అను నీనామము నుచ్చరించునో, వెలవెలఁబోవు మొగముతో యమధర్మ రాజు ఆవ్యక్తిచేసిన కర్మములన్నిటిని, తన లెక్కపుస్తక ములో తుడిచివేయును.

శుక్లపక్షే యదా దేవి తృతీయా బుధసంయుతా।
శ్రవణాయాచ సంయుక్తా తులసీ పుణ్యదా తదా॥ ౨౯

శుక్లపక్షమున బుధవారముతోఁ గాని, శ్రవణ నక్షత్ర ముతోఁ గాని కలసిన తదియనాఁడు తులసి యధిక పుణ్య ఫలము నిచ్చును.

గురు:— నీకు తులసీగీత సమగ్రముగాఁ జెప్పితిని విన్నావుకదా ?

శిష్యుఁడు:— దేవా! మీ వదనారవిందమునుండి వెలువడు చున్న తులసీ మహిమామృత శ్రవణరూపమునందుఁ బిపాస యధికమగుచున్నది. ఇంకను జెప్పుఁడు.

—♦—

# తృతీయ ప్రకాశము

గురు:— వత్సా! నీకు తులసీ మాహాత్మ్యము వినవలెననెడి శ్రద్ధ యంతకంత కధికమగుట చూచి నా కానందము కలిగినది. శ్రీ మహాభాగవతమునఁ జెప్పఁబడిన తులసీ మాహాత్మ్యము చెప్పుచున్నాను, విను —

నారద ఉవాచ.

సాంప్రతం శ్రోతుమిచ్ఛామి తులస్యా పరమాద్భుతమ్।
మాహాత్మ్యమపి సంక్షేపా ద్రుద్రాక్షస్య శివస్య వై ॥ ౩
పూజాయాశ్చ మహాదేవ సంక్షేపా దనుశాధి మే ॥ ౪

శ్రీ మహాదేవా! యిప్పుడు పరమాద్భుతమగు తులసి మాహాత్మ్యమును సంక్షేపముగా రుద్రాక్షయొక్క మహిమను, శివునియొక్కయు వారిపూజా మహిమమును వినఁ గోరెదను. చెప్పుఁడు.

శ్రీ మహాదేవ ఉవాచ.

తులస్యాః శృణు మాహాత్మ్యం సంక్షేపేణ మహామతే।
య చ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో నరో ముక్తి మవాప్నుయాత్ ॥ ౫
తులసీద్రుమరూపస్తు భగవాన్ పురుషోత్తమః।
సర్వలోకపరిత్రాతా విశ్వాత్మా విశ్వపాలకః॥ ౬

మహాదేవుఁడు చెప్పుచున్నాఁడు:— ఓ మహామతీ! సంక్షేపముగా తులసీమాహాత్మ్యమును వినుము. దానిని వినిన మానవుఁడు సర్వపాపములనుండి విముక్తుఁడగును. భగవానుఁడు, పురుషోత్తముఁడు, విశ్వాత్మ, విశ్వపాలకుఁడు, సర్వలోకపరిత్రాత యగు శ్రీహరియే తులసీవృక్షరూపమును ధరించెను.

దర్శనాత్ స్పర్శనా న్నామ కీర్తనా ద్ధారణా దపి।
ప్రదానాత్ పాపసంహర్త్రీ నరాణాం తులసి సదా ॥ ౭

ప్రాతరుత్థాయ సుస్నాతో యః పశ్యేత్ తులసీ ద్రుమం।
స సర్వతీర్థసందృష్టి ఫల మాప్నో త్యసంశయః॥ ౮

దృష్ట్వా గదాధరం దేవం క్షేత్రే శ్రీపురుషోత్తమే।
య త్పుణ్యం సమవాప్నోతి తులసీదర్శనాచ్చ తత్॥ ౯

దర్శనము, స్పర్శనము, నామకీర్తనము, ధారణము శ్రీహరి పదములం దర్పణము చేసినచో, తులసి మానవుల పాపములను సర్వదా నశింపఁజేయును.

ప్రాతఃకాలమున లేచి, చక్కఁగా స్నానముచేసి తులసి చెట్టును చూచినచో నిశ్చయముగా సర్వతీర్థముల దర్శించిన ఫలము మానవులకుఁ గలుగును.

శ్రీ పురుషోత్తమక్షేత్రమున గదాధరుని జగన్నాథదేవుని దర్శనము చేసిన నెంత పుణ్యము కలుగునో, తులసీవృక్ష దర్శనమున నంతఫలము లభించును.

దినం తచ్ఛుభం ప్రోక్తం తులసీ యత్ర దృశ్యతే।
న తత్ర జాయతే తస్య విపత్తిః కుత్రచిన్మునే॥ ౧౦

అపి జన్మాంతరే కృతం పాపమత్యంత గర్హితమ్।
వినశ్యతి మునిశ్రేష్ఠ తులసీవృక్ష దర్శనాత్॥ ౧౧

అశుచిర్వా శుచిర్వాపి యః స్పృశేత్ తులసీదలమ్।
సర్వపాప వినిర్ముక్తస్తత్క్షణాత్ శుద్ధతా మియాత్।
ప్రయాతి చ పదం విష్ణోరంతే దేవ సుదుర్లభమ్॥ ౧౨

తులసీ స్పర్శనం స్నానం తులసీస్పర్శనం తపః।
తులసీస్పర్శనం ముక్తిః తులసీస్పర్శనం వ్రతమ్॥ ౧౩

ప్రదక్షిణీకృతా యేన తులసీ మునిసత్తమ।
కృతప్రదక్షిణస్తేన విష్ణుః సాక్షా న్నసంశయః॥ ౧౪

ఏదినమునఁ దులసీ దర్శనమగునో, ఆదినమే శుభమని చెప్పఁబడినది. జన్మాంతరమునఁ జేసిన యతి గర్హితములగు పాపములు తులసీ వృక్షదర్శనమున నశించును.

శుచిగాఁగాని యశుచిగాఁగాని యేవ్యక్తి తులసీదళమును స్పర్శించునో వాని సర్వపాపములు నశించి తత్క్షణము శుద్ధుఁడగును. అంతమున మిగుల దుర్లభమగు విష్ణుధామమునకుఁ బోవును. తులసీ స్మరణమే స్నానము. తులసీ స్పర్శనము తపస్సు, తులసీస్పర్శనము ముక్తి. తులసీ స్పర్శనము ప్రాశము.

ఓ మునిసత్తమా! ఏ నరుఁడు తులసికి ప్రదక్షిణము చేయునో వాఁడు సాక్షాద్విష్ణువునకుఁ ప్రదక్షిణము చేసినవాఁడగును. ఈ విషయమున నేమియు సంశయము లేదు. ఏ ప్రకారము తత్క్షణము శుద్ధుఁడగునో తెలిసినదా?

శిష్యుఁడు:- చిత్తము. తులసీ స్పర్శనమువలన సత్త్వగుణము కలుగును. దానిమూలమున శుద్ధుఁడయి పవిత్రుఁడగును.

గురు:- ఈ విధముగా ననుక్షణము దర్శనము, స్పర్శనము చేయఁగలిగినచో సత్త్వగుణమునకు స్థితి యేర్పడును. లేనిచో తులసిని సేవించువానికి సత్త్వగుణప్రాప్తి తాత్కాలికముగ కలుగును.

> తులసీ ప్రణమేద్యస్తు భక్త్యా మానవసత్తమః ।
> స యాతి విష్ణోః సాయుజ్యం న పునః ప్రపతేత్ క్షితౌ ॥

ఏ మానవశ్రేష్ఠుఁడు భక్తితో తులసికిఁ ప్రణామము చేయునో వాఁడు విష్ణుసాయుజ్యమును బొందును. వాఁడు మరల భూమిమీఁద జన్మమెత్తఁడు.

> తులసీ కాననం యత్ర, తత్ర సాక్షాజ్జనార్దనః ।
> లక్ష్మీ సరస్వతీ యుక్తా, మోదతే మునిసత్తమ !

యత్ర విష్ణుర్జగన్నాథః, సర్వదేవమయః ప్రభుః ।
తత్రాహం సహ రుద్రాణ్యా, సావిత్ర్యా చ ప్రజాపతిః॥

తస్మాత్తత్పరమం స్థానం దేవానామపి దుర్లభమ్ ।
యో గచ్ఛేత్ స వ్రజేద్విష్ణో, ర్వైకుంఠనగరం మునే॥

స్నాత్వా ప్రమార్జయేద్యస్తు, తత్క్షేత్రం పాపనాశనమ్ ।
సోఽపి పాపవినిర్ముక్తః, స్వర్గలోకమవాప్నుయాత్॥

ఓ మునిసత్తమా! ఎచట తులసీకానన ముండునో అచట సాక్షాత్ జనార్దనుండు లక్ష్మీ సరస్వతులతోఁ గూడి యానంద విహారము సలుపుచుండును. ఏ తావున సర్వదేవమయుండు, ప్రభువు, జగన్నాథుండు, విష్ణువు వేంచేసియుండునో యా తావున రుద్రాణితో నేను, సావిత్రితో బ్రహ్మ నివసించెదము. ఆస్థానము దేవగణములకును దుర్లభము. ఓముని! యాస్థలమున కెవరు పోయెదరో వారు వైకుంఠనగరమునకుఁ బోయెదరు. స్నానముచేసి ఏవ్యక్తి పాపనాశనమగు నాక్షేత్రమును లెస్సగా చిమ్మి పరిశుభ్రము చేయునో, వాఁడును స్వర్గమును బొందును.

యః కృత్వా తులసీమూల, మృదా తిలకముత్తమమ్ ।
కపోలే కంఠదేశే చ, కర్ణయోః కవచద్వయే॥

బ్రహ్మరంధ్రే హృది పృష్ఠే, పార్శ్వయో ర్నాభిదేశకే ।
స పుణ్యాత్మా మునిశ్రేష్ఠ, విజ్ఞేయో వైష్ణవోత్తమః॥

తులసీ పుష్పబృందేన, పూజయేత్ యో జనార్దనమ్ ।
సోఽప్యత్ర వైష్ణవశ్రేష్ఠః, సర్వపాప వివర్జితః॥

వైశాఖే కార్తికే మాఘే, ప్రాతః స్నాత్వా విధానతః ।
యో దదాతి సురేశాయ, విష్ణవే పరమాత్మనే॥

ఏ వ్యక్తి తులసి మొదటనున్న మన్నుతో కపోలము, కంఠదేశము, చెవులు, కవచద్వయము, బ్రహ్మరంధ్రము, హృదయము, పృష్ఠము, పార్శ్వము, నాభి యీ తావుల

నుత్తమమగు తిలకముధరించునో, పుణ్యాత్ముఁడగు నావ్యక్తియే వైష్ణవోత్తముఁడని తెలిసికొనుము. ఎవడు తులసీపుష్పసమూహముతో జనార్దనుని బూజించునో వాఁడును సర్వపాప వివర్జితుఁడగు వైష్ణవశ్రేష్ఠుఁడని చెప్పఁబడును. వైశాఖము, కార్తీకము, మాఖము అను నీ మాసములలో యథావిధిగాఁ బ్రాతఃకాలమున స్నానముచేసి దేవేశ్వరుఁడు, పరమాత్మయు నగు విష్ణునకు తులసీ పత్రము లర్పించువారసంత పుణ్యమును బడయుదురు.

గవా మయుతదానస్య వాజపేయ శతస్య చ।
య త్ఫలం తత్సమాప్నోతి, కార్తికే పూజయన్ హరిమ్॥

తులసీ పత్రకై ర్వాపి, తులసీ పుష్పకై రపి।
తులసీ కాననే యస్తు, జగన్నాథం సమర్చయేత్।
మహాక్షేత్ర కృతాయాశ్చ, పూజాయాః ఫలమాప్నుయాత్॥

పదివేలయావులను దానము చేసిన నేఫలము కలుగునో, నూఱు వాజపేయ యజ్ఞముల వలన నే ఫలము కలుగునో కార్తికమాసమున తులసీవనములో హరిని బూజించిన నా ఫలము కలుగును. తులసీపత్రములతో, నట్లులే తులసీపుష్పములతోఁ దులసీ కాననమున జనార్దనునిఁ బూజించిన యెడల, మహాక్షేత్రములందుఁ జేసిన పూజాఫలము లభించును.

తులసీరహితం నైవ, కర్మ కుర్యా ద్విచక్షణః।
కుర్వ న్నకర్మణ స్తస్య సమ్యక్ఫల మవాప్నుయాత్॥
తులసీరహితా సంధ్యా కాలాతీతేవ నిష్ఫలా।

విచక్షణులగు వ్యక్తులు తులసిలేని కర్మము చేయరు. చేసినచో, నాకర్మము ఫలమీయఁ జాలదు. తులసీరహితమగు సంధ్య, కాలాతీతమైనప్పుడు చేసిన దానివలె నిష్ఫలము.

తులసీ బృందముత్కృష్టం నిర్మాయ హరిమందిరమ్ ।
కృత్వేష్టక బృందైర్వా తత్ర యః స్థాపయేద్ధరిమ్॥
నియతం సేవనాసక్తః స హరేః సామ్యతామియాత్ ।
యస్తు తులసీవృక్షం విష్ణురూపం విభావ్య చ।
త్రిధైవం ప్రణమేన్మర్త్యః స తస్య సమతాం వ్రజేత్॥

నమస్తే దేవదేవేశ సురాసుర జగద్గురో।
త్రాహి మాం ఘోరసంసారాన్నమస్తేఽస్తు సదామమ॥

యస్తు శ్రీతులసీం మత్వా ప్రణమేత్తారిణీ ధియా।
త్రిధా ప్రదక్షిణీకృత్వా సప్తధా వా మహామతే।
మంత్రేణానేన సద్భక్త్యా స తరేద్ఘోరసంసారాత్॥

తులసీబృందమును హరిమందిరము గడ్డితోఁగాని యిటుకలతోఁగాని నిర్మించి, అందు శ్రీహరిని స్థాపించి, నియతముగా హరి సేవాపరాయణుఁడగు మానవుఁడు హరి సామ్యమును బొందును. ఏనరుఁడు తులసీవృక్షమును విష్ణురూపముగా భావించి, త్రికరణములు (మనోవాక్కాయములు) లతో ప్రణామమొనరించిన హరి సముఁడగును. 'ఓ దేవదేవ! సురాసుర జగద్గురో! నీకుఁ బ్రణామము. నన్ను ఘోరసంసారమునుండి రక్షింపుము. నేను నీకు నమస్కారము చేయుచున్నాను. ఏ మానవుఁడు తులసి తారిణి యను జ్ఞానముకలిగి, మూడు లేక యేడుసార్లు భక్తితో నీమంత్రము చదువుచుఁ బ్రదక్షిణము చేయునో, వాఁడు ఘోరసంసారమునుండి యుత్తీర్ణుఁడగును.

త్రైలోక్య నిస్తారపరాయణే శివే
యథైవ గంగా సరితాం వరా స్వయమ్ ।
తథైవ లోకత్రయ పావనార్థం
ద్రుమేషు సాక్షాత్తులసీ స్వరూపిణీ॥

త్వం బ్రహ్మవిష్ణుప్రముఖై ర్యరోత్తమైః
పురార్చితా విశ్వపవిత్ర హేతవే।
జాతా ధరణ్యాం జగదేకవంద్యే
నమామి భక్త్యా తులసీం ప్రసీద॥

ముల్లోకములఁ దరింపఁజేయు పరాకాష్ఠగల శుభస్వరూపా! ముజ్జగములఁ బవిత్రముచేయు గంగ సకల నదులలో బ్రధానమైనట్లు మూఁడు లోకములఁ బావనము చేయుటకు సకల వృక్షములలో సాక్షాత్తులసీ స్వరూపిణివి నీవు. బ్రహ్మ విష్ణు ప్రముఖ దేవశ్రేష్ఠులచేఁ బూర్వ మర్చింపఁబడితివి. జగత్తులో నీవే నవందనీయవు. విశ్వము పవిత్రము చేయుటకు నీవు భూమిలోనుండి యుద్భవించితివి. నీకు భక్తితోఁ బ్రణామము గావించెద. నీవు ప్రసన్నవు కమ్ము.

ఏవం యే ప్రణమన్త్యేనాం ప్రత్యహం మునిసత్తమ।
తస్యై సర్వార్థదా దేవి యత్ర కుత్రాపి తిష్ఠతః॥
తులసీ సర్వదేవానాం పరమప్రీతి వర్ధనీ।
సర్వదేవాధి సంస్థానం యత్రాస్తి తులసీవనమ్॥
పితరోఽపి పరం ప్రీత్యా వసంతే తులసీవనే।
అవశ్యం తులసీదేయా, పితృదేవార్చనాదిషు॥
అదత్వా మనుజైః సమ్యక్ న కర్మ ఫలమాప్యతే।
విష్ణోస్త్రైలోక్యనాథస్య పితౄణాం చ విశేషతః॥
సర్వేషా మేవ దేవానాం దేవీనాంచ మహామతే।
పరమప్రీతిదా జ్ఞేయా తులసీ లోకముక్తిదా॥
తస్మాత్తు తులసీదేయా దైవే పిత్ర్యే చ కర్మణి।
యత్రాస్తి తులసీవృక్ష స్తత్ర భాగీరథీ స్వయమ్।
తీర్థైః సమస్తైః సహితా వసతిం కురుతే సదా॥
తస్మాత్తత్ర మునిశ్రేష్ఠ దేహం సంత్యజతాం నృణామ్।
గంగాయాం మరణే యాదృక్ఫలం స్యాత్తాదృగేవహి॥

ఓ మునిశ్రేష్ఠా! ఈప్రకారముగా నెవరు తులసికిఁ బ్రణామము చేయుదురో వారెచ్చటనుండినను సరే, వారికిఁ దులసి సర్వార్థము లిచ్చుచుండును. ఏతావున తులసీకాననముండునో ఆతావున సమస్తదేవత లుందురు. దేవ పితృదేవతల నర్చించు కాలమున నవశ్యము తులసి సమర్పింపవలెను. తులసి నర్పింపనిచో మానవులు పూర్తిగ కర్మఫలమును బడయఁజాలరు. త్రైలోక్యనాథుఁడగు విష్ణునకు - విశేషించి పితృదేవతలకు, సమస్త దేవ దేవీగణములకు - లోకముక్తిదాయిని తులసి పరమ ప్రీతిదాయిని యని తెలియుము. అందువలననే దేవ పితృకార్యము లవశ్యము తులసీదాన యోగ్యములైనవి.

ఎచ్చోటఁ దులసీవృక్ష ముండునో నాస్థలమున సమస్త తీర్థములతో స్వయముగ భాగీరథి నిత్యము నివాసము చేయుచుండును. ఆ కారణమున మునిశ్రేష్ఠా! యా స్థానమున దేహము విడిచిన - గంగాతీరమున మరణించిన ఫలమునకు సమానఫలము గలుగును.

ధాత్రివృక్షశ్చ చే త్తత్ర వర్తతే బహుభాగ్యతః ।
తదధికతరం జ్ఞేయం స్థలం తద్ బహుపుణ్యదమ్॥
తత్ర దేహభృతాం దేహ పరిత్యాగా న్మహామునే ।
అజ్ఞానతోఽపి ముక్తిః స్యాత్ సత్యం సత్యం న సంశయః॥
ఏతయోః సన్నిధౌ యత్ర బిల్వవృక్షోఽపి విద్యతే ।
తత్ స్థానం హి మహాతీర్థం సాక్షా ద్వారాణసీసమమ్॥
తత్ర సంపూజయే చ్ఛంభో ర్దేవ్యా విష్ణోశ్చ భావతః ।
బహుపుణ్యప్రదం జ్ఞేయం మహాపాతక నాశనమ్ ।
తత్రైకం బిల్వపత్రం యో మహేశాయ నివేదయేత్॥
తథా విష్ణుం సు సంపూజ్య తులస్యామలకీదళైః ।
ప్రయాతి విష్ణుసాయుజ్యం సత్యమేవ మహామతే॥

న పున ర్జన్మ చాప్నోతి తత్క్షేత్రస్య ప్రభావతః ।
ఇత్యుక్తం తే మునిశ్రేష్ఠ మాహాత్మ్యం చ సమాసతః ।
య ఇదం శృణుయాన్నిత్యం సోఽపి స్వర్గ మవాప్నుయాత్ ॥

అత్యంత సౌభాగ్యవశమున నా తావుననే గనుక నుసిరిగ చెట్టుండెనా, ఆ పుణ్యప్రదమగు స్థాన మధికతరమగు నని తెలియవలెను. ఆ స్థలమున దేహులు, అజ్ఞానముచే శరీరము విడిచినను ముక్తి కలుగును. యిది సత్యము, సత్యము, యేమిాం సంశయములేదు. ఈ రెండు వృక్షములున్నచోట మూరేఖుం డెనా, యది వారణాసివలె మహాతీర్థము. ఆ ప్రదేశమునం జేసిన శంభు, దేవీ, విష్ణుపూజలు మహాపాతక నాశకములు, బహుపుణ్యప్రదములని తెలియుము. ఆ స్థలమున నే వ్యక్తి ఒక బిల్వదళమును మహేశ్వరునకు నివేదన చేసినను, అదే విధమున తులసి, ఆమలకీపత్రములచే విష్ణువును బూజిం చినను ఓ మహామతీ! సత్యముగా నా వ్యక్తి విష్ణుసాయుజ్య మును బొందును; ఆ క్షేత్రప్రభావమునం బునర్జన్మము కలు గదు ఓ మునిశ్రేష్ఠా! సంక్షేపముగా తులసీ మాహాత్మ్య మును జెప్పితిని. ఏ వ్యక్తి యీా మాహాత్మ్యమును శ్రవణము చేయునో, వాఁడును స్వర్గమును బడయును. వింటివా వత్సా! తులసీ మాహాత్మ్యమును ?

శిష్యుఁడు:- నేను ధన్యుఁడ నైతిని.

——♦——

# చతుర్థ ప్రకాశము

శిష్యుఁడు:— దేవా! శ్రుతి తులసిని గుఱించి యేమియుఁ జెప్పుటలేదా?

గురు:—

> అకే వేదేతిహాసాశ్చ పురాణాన్యఖిలాని చ ।
> బ్రహ్మ నిశ్వసితానీతి ప్రాహ మాధ్యందిన శ్రుతిః ॥

మాధ్యందిన శ్రుతి యిట్లు చెప్పుచున్నది:— వేదములు ఇతిహాసములు పురాణములు, సమస్తము బ్రహ్మనిశ్వసితములు – బ్రహ్మముఖకమలమునుండి స్వయముగా వెలువడినవి. పురాణముల విషయమున సంశయింపవలసిన పని యేమియు లేదు. పురాణములు వేదములకు నుపబృంహణములగు రుచిరవ్యాఖ్యానములు.

శిష్యుఁడు:— తమ శ్రీముఖమువలనఁ బురాణముల విషయమై విని పురాణశాస్త్రములు కాల్పనికములు కావని విశ్వాసము కలుగుటలో మన సురియాటలాడుచున్నది. ఇప్పటికిని సంపూర్ణముగా నమ్మికకలుగ లేదు. పురాణాదిశాస్త్రములందచలమయిన శ్రద్ధ కలుగునట్లు దేవరవా రాశీర్వదింపుఁడు. శాస్త్రపథ మాత్మలాభమునకు నిరాపదమగు రాజమార్గమని నాకు స్థిరమగు నిశ్చయము. ఈ మార్గము నొక్క— దానినే యవలంబించిన నవశ్యము కృతార్థుఁడు కాఁగలఁడు.

గురు:— భగవత్కృపవలన నీకు శాస్త్రశ్రద్ధ సుదృఢమగుచు గాక. నీకు భగవచ్చరణములందవ్యభిచారిణి యగు భక్తి

లభించును. శ్రుతియందు తులసిని గురించి యున్నది. వాసుదేవోపనిషత్తు చూడుము.

యో గోపీచందనాభావే తులసీమూల మృత్తికాన్ ।
ముముక్షు ర్ధారయే న్నిత్య మపరోక్షాత్మసిద్ధయే॥

గోపీచందన మభావమైనప్పుడు తులసి మృత్తికతో ముముక్షువు ప్రత్యక్షాత్మసిద్ధికొఱకు ఊర్ధ్వపుండ్రమును ధరింప వలయును.

శిష్యు:- ఊర్ధ్వపుండ్రము ముముక్షువుకూడ ధరింపవలెనా ?

గురు:- అవశ్యము ధరింపవలెను. బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, యతి, పరమహంస - అందఱును ఊర్ధ్వపుండ్ర మవశ్యము ధరింపవలెను. ఊర్ధ్వపుండ్ర ధారణముచే విష్ణు సాయుజ్యము లభించును. ముక్తుఁడగును. సంసారమునకు మరల రాఁడు.

శిష్యు:- అన్ని యాశ్రమములందు నొక విధముగు నూర్ధ్వ పుండ్రము ధరింపవలెనని నియమమా ?

గురు:- కాదు. వాసుదేవోపనిషత్తు చెప్పుచున్నది. బ్రహ్మ చారి, వానప్రస్థు లలాటము, హృదయము, కంఠము, బాహుమూలములందు విష్ణుగాయత్రి లేదా కృష్ణాది నామ ములతోఁగాని తిలకధారణము చేయవలయును. గృహస్థు లలాటాది ద్వాదశ స్థలములందు అనామికతో వైష్ణవ గాయత్రి అథవా కేశవాదినామములతో తిలకధారణము చేయవలయును. యతి ప్రణవముతో శిరస్సు, లలాటము, హృదయమున నూర్ధ్వపుండ్రము ధరింపవలెను. పరమ హంస ప్రణవముతో లలాటమున నొక యూర్ధ్వపుండ్రమును

ధరింపవలయును. తిలకధారణ ప్రశంస శాస్త్రములందు విశేషముగా నుల్లేఖింపఁబడియున్నది. భగవదిచ్ఛ గనుక యుండేనేని దానిని గుఱించి వేఱుగ విచారించెదముగాక. తులసీసంబంధమున రామరహస్యోపనిషత్తునందుఁ జెప్పఁ బడి యున్నది.

శ్రీరామ సన్నిధౌ మౌనీ మంత్రార్థ మనుచింతయన్ ।
వ్యాఘ్రచర్మాసనే స్థిత్వా స్వస్తికాద్యాసనం క్రమాత్ ॥
తులసీ పారిజాత శ్రీవృక్షమూలాదికస్థలే ।
పద్మాక్ష తులసీకాష్ఠ రుద్రాక్షకృతమాలయా ॥
మాతృకా మాలయా మంత్రీ మనసైవ మనుం జపేత్ ॥ ఇత్యాది

వాసుదేవోపనిషత్తు, రామరహస్యోపనిషత్తులందు తులసీ మూల మృత్తిక, తులసీ వృక్షమూలము, తులసీ కాష్ఠమాల యివి అతి పవిత్రములు, మంత్రసిద్ధి కనుకూలములని చెప్పఁబడి యున్నది. పురశ్చరణాదులవలన

తతః సిద్ధ మనుర్భూత్వా జీవన్ముక్తో భవేన్మునిః॥

మంత్రసిద్ధుఁడయి మానవుఁడు జీవన్ముక్తుఁడు కాఁగలడు.

శ్రుతియందు లేనిది పురాణములందుండఁజాలదు. శ్రుతియందేది సూత్రరూపముగా నున్నదో, యదియే పురాణము లందు విస్తరముగా నుల్లేఖింపఁబడినది. మంచిది. ఈసారి తంత్రము లందు తులసీసంబంధమున నేమి వివరింపఁబడి యున్నదో వినుము.

## మత్స్యసూక్త షోడశపటలము

సర్వేభ్యః పత్రపుష్పేభ్యో వరిష్ఠా తులసీ ప్రియే।
సర్వకామప్రదా శుద్ధా వైష్ణవీ విష్ణువల్లభా।

భుక్తిముక్తిప్రదా దేవీ సర్వలోకైకమాతా పరా।
యా మాశ్రిత్య గతాః స్వర్గం మనుష్యాః పరమేశ్వరి॥

శివుఁడు శంకరికిఁ జెప్పినాఁడు:- ఓ ప్రియురాలా! సమస్త పత్రపుష్పములలో తులసి శ్రేష్ఠమైనది. సర్వకామముల నిచ్చునది. శుద్ధమైనది వైష్ణవి - విష్ణుప్రియ, భోగమోక్షదాయిని - సర్వలోకహితకరి - ఉత్కృష్ట - ఓ పరమేశ్వరీ! యనేకులు దాని యాశ్రయమున శాశ్వత సుఖస్థానమగు స్వర్గమును బ్రాపించిరి.

హితార్థం సర్వలోకానాం పృథివ్యాం రోపితా పురా।
యథా విష్ణుప్రియా లక్ష్మీ ర్యథా త్వం హరివల్లభా॥

తథేయం తులసీదేవీ చతుర్థీ నోపపద్యతే।
యథా గంగా పవిత్రా హి సర్వలోకవిమోక్షదా॥

సమంజరీదళై ర్యైవ తులస్యా విష్ణు రర్చితః।
తస్య పుణ్యఫలం దేవి కథితుం నైవ శక్యతే॥

తులస్యాః కుసుమై ర్నైవ పూజయే ద్గరుడధ్వజమ్।
కరపత్రం సమం యస్మా ద్వీర్యాయుక్తం వరాననే॥

సమస్తలోకహితమునకై పూర్వకాలమున భూమియందు నిది నాటఁబడినది. ఏవిధముగా లక్ష్మి విష్ణుప్రియయయ్యెనో, నీవు హరప్రియవవో అదేవిధమున తులసీదేవి - నాల్గవది మఱేదియు లేదు. ఏ ప్రకారము సమస్తలోక ముక్తిదాయిని పవిత్ర గంగయో ఆ ప్రకారమే యిది సకలపాపుల పాపముల హరించునది. మంజరీసహిత తులసీపత్రములతో నెవ్వరు విష్ణువును బూజించునో వాని పుణ్యఫలము వచింపఁ దరముగాదు. తులసీ కుసుమములతో గరుడధ్వజు నర్చింపరాదు. ఏలయందువా, అది వీర్యయుక్తమైనది. గఱుకుగా నుండి యాకురాయివలెఁ బీడను గలిగించును.

త్రిషు లోకేషు విఖ్యాతా సర్వపాపప్రణాశినీ ।
సర్వకామప్రదా దేవి సర్వమంగళకారిణీ ॥
సంసారసాగరే ఘోరే తులసీ నౌ స్వరూపిణీ ।
దేవానాం శివపుర్గాయోః పరం తుష్టిప్రదాయినీ ।
కల్మషాఘాతురాణాం చ సేయమేకా మహౌషధిః ॥

ముల్లోకముల విఖ్యాతి చెందినది. సమస్త పాపములను నశింపఁజేయునది. సర్వకామములనొసఁగునది. సకల మంగళములఁ జేయునది. భయంకరమగు సంసారసాగరమునకు నౌకవంటిది. దేవగణములకు శివపార్వతులకు పరమసంతోషము నిచ్చునది. పాపరోగ పీడితుల కిది ముఖ్యమగు మహౌషధి.

అచట మరీచి – రామ సంవాదమను నీ పురాతనమగు నితిహాస ముదాహరింపఁ బడినది. ఓ వరాననా! దానిని వినుము.

పూర్వకాలమున రఘుకులపతి శ్రీరామచంద్రమూర్తి ప్రతిదినము సంధ్యాకాలమున మరీచిమునిని బూజించుచుండెను. అచిరకాలమున నా మునిశ్రేష్ఠుఁడు సంతుష్టుఁడై, పరాత్పరయు దివ్యయు నగు మాలను శ్రీరామున కొసఁగెను. శ్రీరామచంద్రుని మస్తకమున తులసీవనమునఁబుట్టిన మంజరీపుంజములతో గూడిన, చతుర్వేదమయమగు దివ్యమాల నర్పించెను – భగవానుఁడు మంజరీపత్రములతోఁ గూడిన యా మాలను తీసుకొని చూచి కోపించి మునిపుంగవునితో నిట్లనియెను.

అహో కిమవలేపోఽయం బ్రాహ్మణస్య మహాత్మనః ।
వనస్పతేః పత్రజాతం కథం దత్తం మమోపరి ॥
ఆశీర్వాద ద్విజాతీనాం గ్రాహ్యో మత్రిమతా మితి ।
అతోఽహం మునిశార్దూల అవలేపం వహామి తే ॥

అహో! యేమి గర్వము! మహాత్ముఁడగు బ్రాహ్మణునకు యేటి యవజ్ఞ! ఒక చెట్టు ఆకులు నాతలమీఁద నెట్లువేసెను?

మునిశార్దూలా! మతిమంతులగువారికి బ్రాహ్మణుల యాశీర్వాదములు గ్రాహ్యములని యీగర్వమునకు నేనోర్చితిని.

రాముని యీ వాక్యములను విని తులసి రోషముతో శాపమిచ్చెను.

> యస్మాన్మదావలేపేన శిరసో మాం విముక్తవాన్।
> తస్మాద్రాజేంద్ర వైదేహ్యా వియోగస్తే భవిష్యతి॥

ఓ రాజేంద్రా! మదగర్వమున మస్తకమునుండి నను తీసిపారవేసితివి. కావున నీకు వైదేహితో వియోగము కలుగుగాక!

శాపమిచ్చిన తులసీదేవిని, సక్రోధ నయనుడగు సీతా వల్లభ శ్రీరామచంద్రమూర్తిని, మహామతి మరీచి యిట్లని చెప్పదొడగెను.

> సుప్రసీద మహారాజ వ్రజామి శరణం తవ।
> కథయామి పురావృత్తం విచిత్రం మునిభాషితమ్॥
> ఏషా హి తులసీమాలా మయాదత్తా సురేశ్వర।
> తస్యా విచిత్రమాహాత్మ్యం మత్తస్సర్వం నిశామయ॥

మహారాజా! సుప్రసన్నుడవు కమ్ము. నేను నిన్ను శరణు వోచ్చుచున్నాను. విచిత్రముని చెప్పిన పూర్వవృత్తాంతము చెప్పుచున్నాను వినుము. ఓ దేవేశ్వరా! యీతులసీమాలను నేను నీకిచ్చుచున్నాను. దీని యద్భుతమగు మాహాత్మ్యమును వినుము.

> ఇయం హి బ్రహ్మరూపేణ మహాలక్ష్మీ ప్రతిష్ఠితా।
> బ్రహ్మీయం పరమాశక్తిః బ్రహ్మణో రోమసంభవా॥
> ఋగ్యజుస్సామవేదాద్యాః శాఖాచరణసమ్మితాః।
> యథా గంగా యథా గీతా గాయత్రీచ యథా మతా।

పద్మయోనేః సముద్భూతా తథేయం లోకపావనీ।
యత్రైషా తిష్ఠతే సమ్యక్ తత్ర లక్ష్మీః ప్రతిష్ఠితా।
ఇమాం వినా తథా లక్ష్మీర్వినాశాయోపజాయతే।
ఏవం సృష్టా జగన్మాతా తులసీ బ్రహ్మణా స్వయమ్।
లోకానాం పావనార్థాయ పృథివ్యామవతారితా।
ఏనామారాధ్య దేవేశో మహాదేవో జగత్పతిః।
అసురం ఘోరనామాన మజయత్ప్రధనసంకటే॥

ఈ తులసీవృక్షరూపమున మహాలక్ష్మి వెలసినది. బ్రహ్మ రోమ సంభూతయగు నిది శ్రేష్ఠమగు బ్రాహ్మీశక్తి. ఋక్కు, యజుస్సు, సామము మున్నగు వేదములు శాఖాచరణ సమ్మితములు. ఎట్లు గంగ, గీత, యెట్లు గాయత్రి, పద్మయోని, బ్రహ్మ యెట్లు ఉత్పన్నమైరో, అట్లులే లోకపావని తులసియు వాని నుండి పుట్టినది. ఎచట సీతులసి యుండునో యచట లక్ష్మి ప్రతిష్ఠితయై యుండును. తులసిలేని లక్ష్మి వినాశమునకు మూలమగును. ఈవిధముగా స్వయముగా బ్రహ్మ తులసిని సృజించి లోకములు పవిత్రములగుటకై పృథివియం దవతరింపఁ జేసెను. ఈ తులసి నారాధన చేసి జగత్పతి దేవేశ్వరుఁడు మహాదేవుఁడు – ఘోరుఁడను నసురుని యుద్ధమున జయించెను.

ఏవమేషా మహాదేవీ తులసీ విశ్వరూపిణీ।
తామప్యారాధయస్త్వేనాం విజయం ప్రాప్స్యసి ధ్రువమ్॥
ఏతచ్ఛ్రుత్వా తు వచనం మహర్షేర్మధుసూదనః।
జయాయ శిరసా మాలాం ప్రణిపత్యచ సాదరమ్।
జగ్రాహ విటపస్తస్యాః పూజయామాస రాఘవః।
తతస్తస్యాః ప్రభావేన భగవాన్ రఘునందనః।
యాతుధానం మహావీర్యం జితవాన్ రావణం రణే॥

ఈ విశ్వరూపిణియగు తులసీమహాదేవి యిట్టిది. నీవును నీమె నారాధింపుము. నిజముగా విజయము కలుగును. మధుసూదనుఁ డా మహర్షి వాక్యములను విని జయము కొఱకు తలతో సాదరమున మాలకుఁ బ్రణామ మొనరించి, సర్వకామ ప్రదమగు నా వృక్షమును గ్రహించెను. తదనంతర మా ధర్మవృక్షమును దీసికొని తన యింటికిఁ బోయెను. రామచంద్రమూర్తి యథావిధి తులసీవృక్షమును నాటి పూజించెను. భగవానుఁడగు రఘునందనుఁడు దాని ప్రభావమున మహాబలవంతుఁడగు రావణుని రణమున జయించెను.

యే చార్చయంతి మనుష్యా రోపయంతి యథావిధి।
కీర్తయంతి చ యే లోకా స్తేషాం సిద్ధిర్భవిష్యతి॥
సజలం తులసీపత్రం శిరసా ధారయంతి యే।
అర్ఘ్యం దత్త్వా నమస్కృత్వా ముక్తి స్తేషాం కరే స్థితా॥

ఏ మానవులు యథావిధిగాఁ దులసిని నాటి పూజించెదరో, గుణకీర్తనము గావించెదరో వారికి సిద్ధిలాభము కలుగును. అర్ఘ్య మిచ్చి నమస్కరించి, సజలతులసీదళమును శిరసున ధరించెదరో వారికి ముక్తి కరతలమున నుండును.

శిష్యుఁడు:— తులసి చెట్టు నెక్కడ నాటవలెను ?

గురు:— నదీతీరే శ్మశానే చ ఊషరే మ్లేచ్ఛసన్నిధౌ।
ఏషు వై రోపణం కృత్వా యాతి కర్తా యమాలయమ్॥

నదీతీరమున, శ్మశానమున, చవిటినేలయందు, మ్లేచ్ఛసన్నిధిని తులసిచెట్లను వేసిన కర్త యమలోకమునకుఁ బోవును. ఈ స్థలములందు తులసిని నాటరాదు. ఒక వృక్షమును గృహమున కీశాన్యమూలలను నాటుట కర్తవ్యము. తులసికాననమును పవిత్రస్థానమున మానమూని నాటుట విధి.

శిష్యః:- తులసిని నాటు విధ మేది?

గురుః:- గృహస్యైశాన్యపురతః ఖనిత్వా తాలమాత్రకమ్।
పంచగవ్య మయూరాండం క్షిప్త్వా తత్ర దినాగమే॥
రోపయిత్వా నిశాభాగే సూత్రే నావేష్ట్య సప్తధా।
తన్మూలే పిండికాం కృత్వా హస్తమాత్ర సువర్తులామ్॥

గృహమున కీశాన్యమూల నొక తాలప్రమాణ మనఁగా (పెనుప్రేలు నడిమిప్రేళ్ల నడిమి కొలఁత) త్రవ్వి, పంచగవ్యమును మయూరాండమును జల్లి, పగటివేళ నాటి రాత్రివేళ దారముతో నేడుచుట్లు చుట్టి దాని మొదట నొక హస్తప్రమాణము గుండ్రముగాఁ బాదుచేసి దాని మీఁదఁ జతుష్కోణ వేదికను నిర్మించవలెను. బుద్ధిమంతుఁడగువాఁడు నీరు ధారగాఁబోసి గంధపుష్ప ధూప దీప ఘృత పాయస దధ్యన్నాదులతోఁ బూజచేసి, యైశ్వర్య కాముఁడు 'తులస్యై నమః' అను మంత్రముతో నర్ఘ్య ప్రదాన మీయవలెను. శంఖమందలి జలము, దూర్వలు అక్షతలు చందనము కుశాగ్రములు పుష్పాదులతో నర్ఘ్య మీయవలెను.

శిష్యుఁడు:- మత్స్యసూక్తమున ధ్యాన మెట్లు చెప్పఁబడినది?

గురుః:- ధ్యాయే ద్దేవీం నవశశిముఖీం పక్వబింబాధరోష్ఠీం
విద్యోతయంతీం కుచయుగభరా నమ్రకల్పాంగయష్టిమ్।
ఈషద్ధాస్యోల్లసిత వదనాం చంద్రసూర్యాగ్ని నేత్రాం
శ్వేతాంగీం తా మభయవరదాం శ్వేతపద్మాసనస్థామ్॥

శిష్యః:- ఎంత సుందరమగు ధ్యానము! ఈయమ స్తవ మెట్టిది?

గురుః:- ఇంద్రాద్యైః సకలై ర్దేవై రర్చితాం సురసుందరీమ్।
భక్తానాం వరదాం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

నాదబిందుకలాతీతాం ముండమాలాం తపస్వినీమ్ ।
వాసుదేవరతాం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

సర్వదేవమయీం దేవీం వేదగర్భాం మనోరమామ్ ।
యోగగమ్యామహం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

సురాసుర విశేషజ్ఞాం సర్వాలంకార భూషితామ్ ।
త్రిజగజ్జననీం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

పద్మహస్తాం పద్మముఖీం పద్మస్థాం పద్మలోచనామ్ ।
లక్ష్మీరూపామహం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

సంక్రాంత్యాం చైవ పక్షాంతే గ్రహణే చంద్రసూర్యయోః ।
యః పఠేత్ సంయతోభూత్వా సర్వసిద్ధిమవాప్నుయాత్ ॥

వినామంత్రం వినాజప్యం వినాయంత్రం వినాక్రియామ్ ।
వినాధ్యానం వినాతీర్థం సర్వసిద్ధికరం భవేత్ ॥

ఇదం గురుకృతం స్తోత్రం యః పఠేత్ శ్రుణుయాదపి ।
ముక్తిః కరతలే తస్య భుక్తిశ్చైవ నసంశయః॥

ఇతి మత్స్యసూక్తే తులసీస్తోత్రం సమాప్తమ్॥

వత్సా! వింటివా శ్రీమతి తులసియొక్క యపూర్వ మహిమను గుఱించిన విషయము? తులసీదేవి సంసారసాగరము నుండి యనాయాసముగా నుద్ధరింపఁగలదు. తులసీ కాష్ఠమాల శ్రీహరికి అర్పణచేసి ధరించవలెను.

సన్నివేద్యైవ హరయే తులసీకాష్ఠ సంభవామ్ ।
మాలాం పశ్చాత్ స్వయం ధత్తే సవై భాగవతోత్తమః॥

— స్కాందపురాణము (హరిభక్తి విలాసము)

తులసికట్టెతోఁ జేయబడిన మాలను హరికి నివేదించి యావల యెవఁడు ధరించునో వాఁడు భాగవతోత్తముఁడు.

యః పునస్తులసీమాలాం కృత్వా కంఠే జనార్దనమ్ ।
పూజయేత్ పుణ్యమాప్నోతి ప్రతిపుష్పం గవాయుతమ్॥

తులసీకాష్ఠసంభూతాం యో మాలాం వహతే నరః।
ప్రాయశ్చిత్తం న తస్యాస్తి నాశౌచం తస్య విగ్రహే॥
తులసీకాష్ఠ మాలాభి భూషితో భ్రమతో యది।
దుస్స్వప్నం దుర్నిమిత్తం చ నభయం శస్త్రజం క్వచిత్॥

—స్కాంద, గరుడ పురాణములు.

ఎవఁడు తులసిమాలను కంఠమున ధరించి, జనార్దనునిఁ బూజచేయునో, వానికిఁ బ్రతిపుష్పమునకుఁ బదివేల గోదానములు చేసిన పుణ్యము లభించును.

ఎవఁడు తులసికట్టెతోఁ జేసిన మాలను ధరించునో, వానికి బ్రాయశ్చిత్త మక్కఱలేదు. వాని దేహమునకు మైల లేదు. తులసీకాష్ఠ మాలాభూషితుఁడై గనుక తిరుగువానికి దుస్స్వప్నముల వలన, దుశ్శకునముల వలన, శస్త్రముల వలన భయ మెన్నఁడును గలుగదు.

శిష్యుఁడు:- నేను కృతార్థుఁడ నైతిని. ధన్యుఁడ నైతిని.

గురువు:- రమ్మా. ప్రణామము చేయుచున్నాను. రమ్మా.

శ్రియం దేహి యశో దేహి కీర్తి మాయు స్తథా సుఖమ్।
బలం పుష్టిం తథా ధర్మం తులసి త్వం ప్రయచ్ఛ మే॥

"అమ్మా! ధర్మార్థ కామ మోక్ష చతుర్వర్గ ప్రదాత్రి! ఏభక్తుఁడు నీ చరణములకడ నేది కావలెనని ప్రార్థన చేయునో వానికి దానినే యిచ్చుచున్నావు. కోరినను కోరకున్నను 'హరిభక్తి' నిచ్చుట నీ స్వభావము." భక్తుఁడవు కావలెనని కోరుము. తులసిని సేవింపుము. అవశ్యము భక్తి లభింపఁగలదు.

—:o:—

# పంచమ ప్రకాశము

శిష్యుఁడు:— తులసి మహిమ నింకను గీర్తింపుఁడు.

గురు:— దీర్ఘాయుర్భవ! వత్సా! తులసీదేవి యుత్పత్తిని గురించి రెండువిధములుగా వినుచున్నాము. దేవీభాగవతమున తులసి గోలోకమున నున్న గోపిక యని యుల్లేఖింపఁబడి యున్నది. మత్స్యసూక్తమున తులసి బ్రహ్మలోకమున నుత్పత్తియయిన దని చెప్పఁబడినది. ఇప్పుడు బృహన్నారదీయ పురాణమునఁ జెప్పఁబడిన యుత్పత్తి కథను వినిపెద వినుము.

శిష్యుఁడు:- బృహన్నారదీయపురాణ ముపపురాణముకాదా?

గురు:— ఔను. మహాపురాణములు పదునెనిమి దెట్లో అట్లే ఉపపురాణములును పదునెన్మిదియే. ఏ పురాణమైనను అప్రమాణ్యము కాదు. శ్రుతులనువలె పురాణములను నీవు నమ్మఁజాలవా? వేదములు ఉపనిషత్తులు ఈ పురాణముల మాటనే చెప్పినవి. వాని నమ్మకుండుట ఉచితము కాదు. అథర్వవేదము చెప్పుచున్నది.

ఋచః సామాని ఛందాంసి పురాణం యజుషా సహ।
ఉచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే దివి దేవా దివశ్రితాః॥

ఛాందోగ్యోపనిషత్తునందుఁ జెప్పఁబడినది.

సహోవాచ ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేదోఽథర్వణం చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేద మిత్తి.

నేను ఋగ్యజుస్సామవేదములను నధ్యయనము చేసితిని. అట్లే పంచమవేదమగు నితిహాసపురాణముల నధిగమించితిని.

గోపథ బ్రాహ్మణమునఁ జెప్పఁబడినది చూడుము:—

ఏవ మిమే సర్వే వేదా నిర్మితాః సకల్పాః సరహస్యాః సబ్రాహ్మణాః సోపనిషత్కాః సేతిహాసాః సాన్వాఖ్యాతాః సపురాణాః సస్వరాః।

శతపథ బ్రాహ్మణమునఁ జెప్పఁబడినది విను.

ఏవం విద్వాన్ వాకోవాక్యమితిహాసః పురాణ మితిహాసాః స్వాధ్యాయ మధీతే త ఏనం తృప్తాస్తర్పయంతి సర్వైః కామైః సర్వైర్భోగైః.

బృహదారణ్యక శ్రుతియందు పురాణములు పరమ పురుషుని నిశ్వాసమువలనఁ గలిగినవని చెప్పఁబడియున్నది.

ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః।
సూత్రాని వ్యాఖ్యానా న్యస్య వ్యాఖ్యానాన్యస్యైవ నిశ్వసితాని॥

ఇతిహాస పురాణాని పంచమం వేద మీశ్వరః।
సర్వేభ్య ఏవ వక్త్రేభ్యః ససృజే సర్వదృగ్వశః॥ —భాగ. 3 స్కం.

పంచమవేదము, ఇతిహాసము, పురాణములు ఈశ్వరుని ముఖపద్మము నుండియే సృష్టింపఁబడినవి.

వేదములు నిఖిలవాఙ్మయమున కాదిభూతములు — భగవానుని స్వరూపములు. ఆ వేదముల ఉపబృంహణములు అనఁగా వి స్తృతవ్యాఖ్యానములు ఇతిహాసపురాణములు.

పురాణతత్త్వము పురాణములను గుఱించి వేదమునందున్నవని నీకు వినిపించితిని. ఈ పురాణములు మానవులు చేసిన అప్రమాణిక గ్రంథములు కావని నీకుఁ దెలుపఁబ్రయత్నించుట కాశపడుచున్నాను.

శిష్యుఁడు:- పురాణముల విషయము వేదములందు ఉపనిషత్తులందుల్లేఖింపఁబడినదని, పురాణములు పంచమవేదమని

యిప్పుడు తెలిసికొంటిని. పసితనమునుండి పురాణములు సాంప్రదాయికగణముల స్వకపోలకల్పితములని వినుచు వచ్చినాను - విజ్ఞాన భూగోళ విరుద్ధములగు పురాణము లనిష్టకరములని సర్వదా పరిత్యాజ్యములను నీసంస్కారము నశించుటకు విలంబమగును. నాకు శాస్త్రములందు విశ్వాసము కలుగునట్లు లాశీర్వాదింపుడు.

గురు:- నీకు శాస్త్రములందు దృఢమగు విశ్వాసము కలుగు నట్లు భగవచ్ఛరణారవిందములకడ ప్రార్థనచేయుచున్నాను. పురాణతత్త్వము గ్రంథములందు లెస్సగాఁ జదువుము. అందువలన నీకు పురాణసంబంధమునఁ గలుగు సమస్త సంశయములు తొలఁగిపోవును. మంచిది. ఒకసారి తులసీ దేవి విషయము వినుము.

ఒకనాడు కైలాసమందున్న జగదంబికను గురించి యా చెలికత్తె లిరువు రిట్లు లడిగిరి.

మాత ర్దుర్గే మహేశాని తులశీ బిల్వవృక్షయోః।
జన్మ మాహాత్మ్య తత్త్వాని కథయస్వ కృపామయి॥

— బృహన్నారదీయము ౧ అధ్యా.

ఓకృపామయి మహేశాని! మాతా! దుర్గా! తులసి, మారేడు వృక్షముల జన్మము మాహాత్మ్యము తత్త్వము మాకుఁ జెప్పుము.

దేవ్యువాచ :

పురా కైలాస శిఖరే బ్రాహ్మణః కశ్చిదాస హ।
ధర్మదేవ ఇతి ఖ్యాతః సాధు ర్విష్ణుపరాయణః॥
బృందా నామ తస్యపత్నీ బ్రాహ్మణీ ధర్మచారిణీ।
సదా పత్యనుగా సాధ్వీ పతిశ్రేష్ఠా సుఖాన్వితా॥

దేవి చెప్పుచున్నది :

పూర్వము కైలాసశిఖరమున ధర్మదేవుఁడను పేరుగల యొక విష్ణుపరాయణుఁడగు సాధుబ్రాహ్మణుఁడు వాసము చేయుచుండెను. పతివ్రతయు, సుఖాన్వితయు, సదా పతి ననుగమించియుండునదియు, ధర్మచారిణియు, సాధ్వియు నగు బృంద యా విప్రుని భార్య. సతియగు బృంద పతి యాజ్ఞాను సారము సర్వదా దేవకార్యములు చేయుచు, స్వయముగాఁ దానును దేవపూజ, పతిపూజ చేయుచుండెడిది. కలకలలాడు నగు మొగము కలదియు, తపస్వినియు, నణఁకువ కలదియు, సమస్తసాధుగుణసంపన్నయు నగు నా యన్నుఁగుమిన్న యెల్లర మన్ననలకుఁ బాత్రయయ్యెను.

కృష్ణభక్తిపరాయణుఁడగు నా ధర్మదేవుఁడు ఋషిమండలములందు శివ, కృష్ణ నామముల గానము జేయుచుఁ బర్యటనము చేయుచుండెను. ఆ ధర్మాత్ముఁడు దర్శనీయుఁడును, ధర్మజ్ఞుఁడును, స్మితవదనుఁడును, గానవిద్యావిశారదుఁడును, సాధుపూజితుఁడును, సుందరకంఠముతో సర్వదా మనోహరముగా భగవన్నామమును గానముచే విష్ణుభక్తిని, తన శీలము చేత సమస్తలోకుల చిత్తములను ఆనందింపఁజేయుచు, లోకపావనుఁడయి ధర్మదేవుఁడు తిరుగుచుండెను. ఓ సఖీ! యొక దినమున నా ద్విజుఁడు బ్రాహ్మణసభయందు గానము చేయఁజేయ మధ్యాహ్న భోజనకాలము గూడ దాఁటిపోయెను. గృహమునం దా విప్రు నిల్లాలు బృంద - వచ్చిన యతిథులను బూజించినపిమ్మట పతికిఁ బ్రణామము చేసి, దేవపూజ గావించి జలపానము చేసెను. అటుపిమ్మట ధర్మదేవుఁడు స్వగృహమునకు వచ్చి, తన భార్య తనకన్న ముందుగా జలపానము చేయుట

చూచి, దైవవశమున హఠాత్తుగా 'రాక్షసివి క'మ్మని శాప మిచ్చెను.

తన పెనిమిటి యిచ్చిన శాపవశమున బృంద వెంటనే రాక్షసియై కైలాసశిఖరమున దిరుగఁదొడఁగెను. ఆఁకలిచే నామె మార్గమున వచ్చు మనుష్యులను, వ్యాఘ్రములను, సింహములను, గజములను, ఖడ్గమృగములను, పందులను, లేళ్ళను, దున్నలను భక్షింపఁసాగెను. పూర్వసంస్కార బలమున గోవులయు, బ్రాహ్మణులయు, వైష్ణవులయు జోలికిఁ బోవునది కాదు. తక్కిన యితర ప్రాణులను దినుచు భూషించి ఆస్థిమాలినిగాఁ జేసెను.

తర్వాత కైలాసశిఖరము స్మరణకు వచ్చి, యక్కడకుఁ బోవలెనని యిచ్ఛ కలిగి, మూఁడు దినా లుపవాసము చేసి యక్కడకుఁ జేరెను. ఆమె యాఁకలికిఁ దట్టుకోనలేక 'దేని నైనఁ దినెద'నని యాలోచన చేయఁగా, 'నక్కడనున్న ప్రాణులన్నీ శైవస్వభావముకలవే — ఇఁక బ్రాహ్మణులు నట్టివారే — వీరు నా దంతప్రహారమున కెట్లు పాత్రము కాఁగలరు ? శివలోకమున వృక్షములును శివమయములే. అవియు నేను దినఁదగినవి కావు' అని యీవిధముగాఁ జింతాకులితచిత్తయైన బృందను జూచి, శివపర్వతమందుండిన బ్రాహ్మణులు వారిలో వారు 'ఎప్పుడు నట్టిదోష మెఱుఁగనిది, గుణవతియు నగు బృంద రాక్షస భావమును బొందినది. దైవముకంటె బలమైనది మఱొకటి లేదు. స్త్రీలకు లోలుపత్వము ప్రధాన దోషముగాఁ జెప్పఁ బడినది. నిర్దోషయగు బృందయుం దాదోష మేర్పడినది. ఆహా! దైవమెంత బలీయమైనది ? ఔనుగాక ! ఈ బృంద మునుపు చేసియున్న ధర్మబలమున కృష్ణనామమును విని, నామమయు

దేహమును దాల్చి మోక్షమును బడయఁగలదు ' అని చెప్పు కొనుచు, సర్వపాప నాశకమగు కృష్ణనామమును వారు గానము చేయ ప్రారంభించిరి. శాపముచే రాక్షసియైన బృంద నామమును వినసాగెను. క్షుధాపీడిత యగు బృంద యా కైలాస శిఖరమున నెందెందుఁ జనిన నందందు హరినామమే వినవచ్చుచుండెను. హరినామ శ్రవణము చేయుచు నా బృంద యేడు దినములు ఉపవాస మొనరించి కైలాసమందే దేహ మును విడిచెను.

అనంతరము ఒక సంవత్సరము గడచినది. మహాదేవుఁడు నాతో సంతోషమున జూచుచుఁ జూచుచు బాగుగ వికసించిన తామరలతో విరాజిల్లు పుష్కరిణి గట్టునకుఁ జేరి, యందు మరణించిన బృందయొక్క రాక్షసి శరీర మత్యంత శోభాయ మానముగా నుండుటఁజూచి, మహేశ్వరుఁడు ' చూచితివా! పూర్వ మొక విష్ణుభక్తుఁడగు బ్రాహ్మణుని భార్య పరమవైష్ణవి, దైవవశమున రాక్షసియయి, యిచట దేహత్యాగము చేసి యే విధముగాఁ బ్రకాశించుచున్నదో! చూచితివా! దేహ మును వదలి యొక సంవత్సరమైనను చెడక యెట్లు శోభగా నున్నదో! చూడుము. ఓ దేవవందితా! శ్రీ విష్ణుభక్తి మాహా త్మ్యము, విష్ణునామ శ్రవణఫలము మన కీ శరీరమునందుఁ గానవచ్చుచున్నదికదా! ' యని చెప్పెను. నేను మహేశ్వ రుని వలన నీ కథను విని, మృతయైన బృందశరీరమును జూచి యాశ్చర్యపడితిని. అప్పుడు నేను, దేవదేవేశ్వరునితో 'దేవదేవా! ప్రభో! హరా! యీ మృత నయనములం దంతట విష్ణునామము కానవచ్చుచున్నది. మఱియు నీ బృంద దేహమునందెల్ల ద్వాదశాక్షర మంత్రము కనుపించుచున్నది.

అప్పుడు శంభుగణము అంతయు నానందముతో నా నామ మును పఠించుచున్నారు. శివగణ మా తేజోమయమగు శరీర మును దాకఁగానే అది కోటికోటి ఖండములైనది. ఒక్కొక్క ముక్కయందు 'ఓం నమో భగవతే వాసుదేవాయ' యను మహాఫల ప్రదమగు మంత్రము, ఆ మంత్రముయొక్క ప్రతి యక్షర గర్భమున విష్ణుసహస్ర నామములు కానవచ్చు చున్నవి. ఈ విధముగా నీ బృంద శరీరము కోటికోటిఖండము లందుఁ గానవచ్చుచున్నది.' యని యంటిని. తదనంతరము సాక్షాల్లోక శంకరుఁడగు శంకరుఁడు ప్రీతమనస్కుఁడయి, యానందనృత్యము చేయుచున్న యా ప్రథమ గణములను, జూచి, "యీ బృంద ధర్మదేవుని భార్య, వైష్ణవి. శాపవశ మున రాక్షసియయ్యెను. బ్రహ్మహత్య చేయలేదు. ఈ విష్ణు ప్రీతికారిణి వృథయగుట తగదు. ఈ బృంద భూలోకమున వృక్షరూపము ధరించి విష్ణువునకుఁ బ్రీతిని గలిగించుఁగాక! ఓ గణములారా! మీరంద ఆ శరీరమును దీసికొనిపోయి భూమియందు నాటిరండు. ఈ బృందయొక్క పత్రములవలన స్వయముగ శ్రీహరి పూజితుఁడగును. మనులతోను మునీశ్వ ములతోను యీ విధముగా నర్చింపఁబడుఁ . ఈ బృందను 'తులసి' యను సుపావన నామ మగునుగాత! చక్కనియుఁ గాంతిసంపన్నయయి యున్న నీయమ పేరు 'తులసి' యని చెప్పఁబడఁగలదు. ఈ యమ ప్రతిదళమునందు ద్వాదశాక్షర మంత్రమున్నది. ఉమామహేశ్వరుల కీ బృంద యధిష్ఠాన దేవత. ఈమె కుపాస్యదైవము నారాయణుఁడు. ఈమె వైష్ణవిప్రియ" యని శంకరుఁడు ప్రమథగణములకుఁ జెప్పెను.

ఈ సమయమున ధర్మదేవుఁడు బృందావియోగ జనిత శోకాతిరేకమున క్షీణమలినుఁడయి, 'బృందా! బృందా!' యని రోదనము చేయుచు నక్కడకు వచ్చెను. వచ్చి "ఓ ప్రియా! నీ వెక్కడ? నేను నిర్దయుఁడను. నిర్దోషిని. నిన్ను రాక్షసివి కమ్మని శాపమిచ్చితిని. ఛీ ఛీ, నేనేమి మనుష్యుఁడను?" అని తనను నిందించుకొనుచు నేడ్చుచుండ, మహాదేవుఁ డతని నోదార్పఁ, గొంతవడికి మనస్సు కుదుర్చుకొని, శివునికిఁ బ్రణామించి, 'ఛీ ఛీ నే నెట్టివాఁడను? అవివేకినై మహేశ్వరుఁడగు సాక్షాచ్ఛివున కభివాదనము చేయనైతి' నని తనను నిందించుకొనెను.

బృందా వృత్తాంతము తెలిసినతర్వాత ధార్మికుఁడగు నా బ్రాహ్మణుఁడు పరమేశ్వరునితో, 'నారాయణునకై బృంద తులసి చెట్టుగా నయినప్పుడు, నాకు ప్రియయగు నావృక్షము నకు మూలమయ్యెద' నని పలుక, శంభుఁడు 'తథాస్తు' అనెను. ధర్మదేవుఁడు తులసికి మూలమయ్యెను.

అనంతరము శివుని యాజ్ఞనుగొని ప్రమథగణము లానంద ముతో భూమండలమునకువచ్చి యా దేహమును నుత్తమ మగు కాళిందీ (యమునా) తటమున నాటిరి. ఏ స్థానమున గోవర్ధన గిరివరము విరాజిల్లుచున్నదో - యమున నే దేశ మున అర్ధచంద్రాకారముగాఁ బుట్టియున్నదో, శ్రీకృష్ణునకుఁ బరమప్రీతి స్థలము, త్రైలోక్యమునకు గోపనీయ స్థలము, యోగుల శిరములందున్న సహస్రార పద్మమువలె వాంఛిత మగు స్థలము నగు నాదేశమున బృందను నాటి శివగణములు మరల కైలాసమునకుఁ బోయెను.

అనంతరము దామోదరునకుఁ బ్రియమగు కార్తిక మాసమున అమావాస్య తిథియందు ప్రాతఃకాలమునఁ దులసి, విష్ణువునకు శివునకుఁ బ్రీతిగా నావిర్భవించెను. తులసి యావిర్భవింపఁగానే శివునితో నారాయణదేవుఁడు భూలోకమునకు వచ్చి తులసిని జూచెను.

మహామేఘప్రభాం శ్యామాం స్కంధ పల్లవశోభితామ్।
దళై రసంఖ్యైః సంపూర్ణాం మహామంత్రమయీం స్థిరామ్।
జ్వలంతీ స్వేన మహసా గంధామోదిత దిఙ్ముఖామ్॥

మహామేఘమువలె శ్యామవర్ణముకలిగి, స్కంధపల్లవములతో శోభిల్లుచు, మహామంత్రమయియు, పత్రయుక్తయు స్వీయ తేజస్సుచే దేదీప్యమానయై సుగంధముచే దిక్కులఁ బరిమళింపఁ జేయుచున్న తులసిని జూచెను. విష్ణువు శివునితో నాతులసిచెట్టును జూచి సంతోషించెను; అప్పుడు మంగళప్రదయగు తులసీదేవి మూర్తిని పరిగ్రహించెను. శ్యామాంగి, మనోహరవదన, ద్విభుజ, స్మితభూషిణి, శంఖపద్మధర, నానాలంకార భూషాదులచేత సుశోభితయయి తులసి నారాయణదేవుని స్తోత్రము చేయఁసాగెను.

ఓం నమో భగవతే తుభ్యం నారాయణజగత్పతే।
కేవలానుభవానంద స్వరూప పరమేశ్వర।
సంసారయే మహేశాయ కేశవాయ నమోస్తుతే।
హరయే నరసింహాయ శ్రీకాంతాయ నమోనమః।
నమో భక్తైకలభ్యాయ శర్కదూరాయ తే నమః।
నమో వేదాంత వేద్యాయ విద్యా వేద్యాయతే నమః।
నమస్తే శ్రుతిగమ్యాయ, శ్రుతి స్తుత్యాయ తే నమః।
నమోనీలఘనశ్యామ తనవే ధృతమూర్తయే।

బహురూపాయ రూపాయ నిరూపాయః నమోనమః ।
పూజకాయ చ పూజ్యాయ పత్రపుష్పైః ఫలైః ప్రభో ।
అభవాయ భవచ్ఛేత్రే సుఖదుఃఖప్రదాయచ ।
త్వైవాహం సుఖకరా త్వం చ మే ప్రభురీశ్వరి ।
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమో హరేః॥

ఈ విధముగా స్తవ మొనరించిన తర్వాతఁ బ్రణామము, ప్రదక్షిణము చేసి శివుని స్తోత్రము చేసెను.

ఓంకారాయ నమస్తేఽస్తు శంకరాయ నమోనమః ।
శివాయ హరయే దక్ష బలిక్రతు హరాయతే ।
ఏక త్రిపురహంత్రే తే కైటభాంధక ఘాతినే ।
శ్రీ గౌరీపతయే కృష్ణ మహాదేవ నమోఽస్తుతే॥

ఈ ప్రకారము స్తోత్రము చేసిన తులసినిఁజూచి, దేవకీ నందనుఁడగు హరి —

తులసి శ్రీమతి శ్రేష్ఠే బృందే బృందావనే ప్రియే ।
స్థిరీభవ మమ ప్రీత్యై యావదా చంద్రతారకమ్॥

ఓ శ్రీమతీ! శ్రేష్ఠా! బృందావనా! ప్రియా! బృందా! చంద్రతారక లున్నంత కాలము నా ప్రీతికై స్థిరముగా నుండుము.

నరసుర సురోరగాదుల సర్వదా యభినందింపఁ జేయు దానవు. వందనీయవు. నీ పత్రములకంటె నా పూజ కన్యము లేదు.

ఏకతః సర్వనైవేద్య నానాపుష్ప విభూషణమ్ ।
ఏకతః పత్ర మేకం తే ద్వాదశాక్షర మంత్రవత్॥

నానాపుష్ప విభూషణ నైవేద్యములొకటి, ద్వాదశాక్షర మంత్ర విశిష్ట మగు నీ పత్ర మొకటి సమానము. వృక్ష

రూపిణివగు నీకుఁ బ్రదక్షిణముగావించి, దండప్రణామము సమర్పించువాఁడు సప్తద్వీపములతోఁడి భూమికిఁ బ్రదక్షిణము చేసినవాఁడగును. శ్రాద్ధము, తర్పణము, దానము, నైవేద్య దానము - నీ పత్రము లేనిది ఫలము నీయఁజాలవు. నన్ను నీ పత్రములతోఁ బూజించిన, సకలదేవతలు తుష్టి చెందెదరు.

కార్తికమాసమున నే మానవుఁడు నాకు నీ పత్రమొకటి సమర్పణము చేయునో వాఁడు సహస్రగోదానముల ఫలమును బొందును.

> మాఘేమాసి చ తే పత్ర మాలాం యచ్ఛతి యో జనః।
> తస్మా దహం ప్రయచ్ఛామి వాజిమేధక్రతో ఫలమ్॥

మాఘమాసమున నీ పత్రములతోఁ గూర్చిన మాలను నాకుసమర్పించువానికి నేను అశ్వమేధ ఫలము నిచ్చుచున్నాను. వైశాఖ మాసమున నీ పత్రములతో శయ్యను కల్పించి నాకిచ్చువానికి నన్నే యిచ్చుకొనుచున్నాను. ఇంతకు అధిక మేమున్నది ? వైశాఖమాసమున నీ పత్రముల జలముతో నన్నభిషేకించువానికి సతతము అమృతవిధియందు స్థానమిచ్చు చున్నాను.

ఆషాఢమాసమున నీ పత్రముల రసముతో వాసితమగు జలము నాకర్పించు వ్యక్తికి నేను మోక్షమిచ్చుచున్నాను. నీ పత్రములు భూతలమున నేతావున పడినను శివుని యాజ్ఞచే వానిని నామ స్తకముతో గ్రహించెదను.

> త్వత్పత్ర జల సిక్తాన్నం యో భుంక్తే మానవః క్వచిత్।
> త దేవామృత మిత్యుక్తః భుక్తం భాగ్యవతా శుభే।
> త్వ త్పత్ర రసభోజీ చ గంగాజల సమన్వితమ్।
> సోఽహ మిత్యేవ విజ్ఞేయం సత్యం సత్యం శపేశపే॥

నీ పత్రజలముతోఁ దడిసినయన్నము నే మానవుఁడు భుజించునో యదియే యమృతమని చెప్పఁబడును. అదృష్టవంతుఁడే దానిని భుజించును. గంగాజలముతోఁ జేర్చిన నీపత్రరసమును సేవించువాఁడు నేనే యని విశేషముగాఁ దెలియఁదగును. నేను నిజముగ శపథముచేసి చెప్పుచున్నాను.

ఓ శోభనా! యే వ్యక్తి నీ పత్రమును దాఁకి యబద్ధము లాడునో వాఁడు గోటి కల్పముల కయినను నుగ్రనరకము నుండి విముక్తిని గాంచలేఁడు.

త్వత్కాష్ఠమాలాం త్వత్కాష్ఠఘృష్టే పంకంచ యోఽదధాత్ ।
అహం తస్యానుగః శ్రద్ధే భవామి సుతవత్ పితుః॥

పవిత్రమైన ఓ తులసీ! నీ కట్టెతోఁ జేసిన మాలను, నీ కట్టెతోఁ దీసిన గంధమును నే వ్యక్తి ధరించునో 'తండ్రి కొడుకు వెంటఁ బోవునట్లు' వాని వెంట నేను బోయెదను.

ఈ కథను జెప్పి, భూలోకములో పాపనాశినియగు తులసీ దేవిని యభిషేకించి, యింద్రాది దేవగణములు, ప్రమథ గణములతో మహేశ్వరుఁడును నంతర్ధానము చెందిరి.

ఓ జయ విజయులారా! మీకు తులసి జన్మకర్మములను గుఱించి చెప్పినాను. తులసి – ఆకాశము, స్వర్గము, మర్త్యము యీ మూఁటికి తీర్థస్థానము.

ఈ హరిప్రియను మానవులు సాదరముగఁ బూజించెదరు. దర్శనాది మంత్రములను వినుము.

దర్శన మంత్రము.

దేవి విష్ణుప్రియే మాత స్తులసి ప్రియ దర్శనే ।
హరి దర్శన దీపార్చిః ప్రసీద ద్విజ వల్లభే॥

ఈ మంత్రమును జెప్పి, కనులార తులసిని దర్శించవలెను. అట్టివానికి యమదర్శనము లేదు. ఇఁకఁ జెప్పఁబోవు మంత్రముతోఁ బ్రణామము చేయవలెను.

విష్ణు ప్రీతికరే మాతుర్నమస్తే తులసీశ్వరి।
పవిత్రీ కురు మేఽంగాని విష్ణ్వంగ హర్షకారిణి॥

ప్రదక్షిణ పురస్సరముగా సాష్టాంగ ప్రణామము చేయవలెను. నీడ దాటరాదు. అటుపిమ్మట—

వైకుంఠ పాదాబ్జవాసినీ ప్రియదర్శనే।
స్పృశామి త్వాం మహాపాపసంచయాన్ మే ప్రణాశయ॥

ఈ మంత్రము చెప్పుచు స్పృశించిన మానవుఁడు ముక్తిబడయును.

స్థలమార్జన మంత్రము.

మాత స్తులసి కల్యాణి స్థలం తే సుమనోహరమ్।
క్రీడంత్యాగతా విబుధా మార్జయే తత్ ప్రసీద మే॥

తులసి నాలుగుదిక్కుల నాల్గుచేతులపెట్టు చిమ్మి గోమయముతో నలకవలెను.

'ఓం తులస్యైనమః' యీ షడక్షరమంత్రమును, బూజ చేసినతర్వాత అష్టోత్తరశతము (౧౦౮) జపము చేయవలెను.

మాత స్తులసి ల్యాణి గోవిందచరణప్రియే।
కేశవార్థే చి మి త్వాం ప్రసీద శుభదర్శనే॥

ఈ మంత్రముతోఁ దులసిని చయన (గ్రహణ) ము చేయవలెను. తులసి సిన్నటిదియైనను హరిపూజకు పనికివచ్చును. పర్యుషితదోషము తులసికి లేదు. అశుచిగా నున్నప్పుడు, పాదుకలు తొడిగికాని తులసిని తాఁకరాదు. పడమటి మొగమై తులసిని గ్రహింపరాదు. అమావాస్య, పూర్ణిమ, ద్వాదశి తిథులందు, రాత్రివేళ, సాయంకాలమున తులసిని

తాఁకరాదు. నిషిద్ధకాలములందును శ్రీహరినిమిత్తము కోలఁదిగా గ్రహింపవచ్చును. ద్వాదశి మొదలే కూడదు.

చెట్టును మిగులఁ గదలింపరాదు. కొమ్మలు త్రుంచరాదు. ఇట్లు కాకుండ తులసీచయనము చేసిన విష్ణువునకుఁ బ్రియమగును.

తులసీ మూల సంభూతా మృదం మూర్ధ్నా బిభర్తియః।
దధాతి రూపం సోఽర్కస్య తమోనాశాయ కేవలమ్॥
గంగా మృదా చందనేన తన్మూలస్య మృదాఽపి వా।
యుక్తం స్వశీర్షే యోధత్తే సభవే త్తీర్థమేవ చ॥

తులసి మూలమందలి మృత్తికను శిరస్సున ధరించువాఁడు కేవలము తమోనాశమునకయి సూర్యుని రూపమును ధరించియుండును. గంగ - మృత్తికగాని, చందనముగాని లేదా తులసి మొదటినందలి మృత్తికగాని చేర్చి తులసిపత్రమును శిరస్సున ధరించు వ్యక్తి తీర్థస్వరూపము.

తులసీ కాననం యత్ర తత్ర నాస్తి యమక్రియా।
తత్ర చేన్మ్రియతే జంతు జంతుత్వం న పునర్భవేత్॥
తులసీ స్థాపయే న్మర్త్య ఉచ్ఛస్థానే పరిష్కృతే।
అక్షయ స్వర్గవాసో హి తేన -భ్యో న సంశయః॥
శ్రాద్ధం దానం తపో హోమః సంధ్యోపాసన పూజనే।
పురాణపఠనం చాపి తులసీ సన్నిధే చరేత్॥

తులసితోట యున్న తావున యముని పెత్తనము లేదు. ఆ స్థలమున ప్రాణముపోయినవానికి మరల దేహము ధరింపఁ వలసిన పనిలేదు. బాగుగ అలంకారముచేసి, యెత్తైనస్థలమున తులసిని నుంచినవానికి అక్షయమగు స్వర్గవాసము లభించును.

ఇందుకు సందేహము లేదు. శ్రాద్ధము, దానము, తపస్సు, హోమము, సంధ్య, ఉపాసన, పూజ, పురాణపాఠము తులసీ సన్నిధిలోఁ జేయవలెను. విన్నావా నాయనా! తులసీ మాహాత్మ్యము?

శిష్యు :- నాఆనందమును మాటలతోఁ జెప్పలేనుస్వామీ!



## షష్ఠ ప్రకాశము

గురు:- ఇంతవఱకు నీకు శాస్త్రములోని విషయములే వినిపించితిని. అందువలన నీకు విసుగు కలిగియుండవచ్చును. ఇప్పుడు చికిత్సకులు, గుణగ్రాహులగు వైదేశిక వైజ్ఞానికులు (Western Scientists) ఏమి చెప్పుచున్నారో కొంచెము విను.

శిష్యు:- సెలవిండు. దేవా!

గురు:- కొన్ని సంవత్సరాలకుఁ బూర్వము జపానునుండి వచ్చిన యొకఁడు వంగదేశములో నున్న తులసితోఁటలను జూచి, 'మా జపానులోవలె నిక్కడ తులసి వేయుచున్నారే' యని యనెను. ఇతఁ డేల యనుచున్నాఁడా, యని నవ్వువచ్చెను - జపానులోఁ బ్రతి యింటిలో 4, 5 గజాల విస్తీర్ణముగల తులసితోఁట యుండును. అది లేని యిల్లే లేదని యతఁడు చెప్పెను. నేను జపాను పోలేదు. అక్కడకుఁ బోయివచ్చినవారు దాని నిజానిజములు చెప్పఁగలరు.

౧౩౩౧ సంవత్సరపు హ్యానిమాన్ మాసపత్రిక భాద్రపద మాస సంచికలో శ్రీ ప్రమదా ప్రసన్న విశ్వాస, దేశీయ భైషజ్య తత్త్వమున, తులసిని గుఱించి వ్రాసియున్నారు. శాస్త్రము విషయము చెప్పి, దానిమీఁద 'తిను వస్తువులలో తులసి యుంచిన, నవి చెడిపోవు. తులసి క్రుళ్లుపట్టకుండఁ జేయును. దుర్గంధనివారకము. తులసి తీర్థము కంటిజబ్బుల కౌషధ'మని చెప్పినాఁడు.

నానాప్రకారములయిన చికిత్సలు చేసినను నిర్మూలించని గడ్డురోగములు తుద కొక సాధువు చెప్పినమీఁదట తులసి పాదులోని మృత్తిక ప్రతిదినము శరీరమునకుఁ బూసికొని, యీ మృత్తిక నియతముగా కొంచెము కొంచెము తినినందున సమస్తవ్యాధులు వాసియైనవి, ఈ విషయము చూచినదే. మఱియు దాని యాకులు, పువ్వులు రాలిన నేలయు నసాధారణ గుణములు కలదయి యున్నది.

అవశ్య మీవిషయము శాస్త్రములందుఁ బలుతావులఁ జెప్పఁబడియున్నది. అయిననేమి; యీకాలపుఁ జదువరుల మనుకొను వారికి ఋషులవాక్యములకంటెఁ బాశ్చాత్యులు, పాశ్చాత్యవిద్య నేర్చిన చికిత్సకులు (Doctors) చెప్పు మాటల యందు విలువ యెక్కువగా నుండును గాన వానినే చెప్పుచున్నాను.

ఈ యాంగ్లేయుల లెక్కలోని డాక్టర్ నళినీనాథ మజుందారు మహాశయుఁడు, ౧౩౨౫ సంవత్సరము భాద్రపద మాసపు 'చికిత్సాప్రకాశ' పత్రికయొక్క సంచికలో తులసీ సంబంధమున నేమి వ్రాసియున్నాఁడో దానిని నీ క్రింద వివరించుచున్నాను.

మా జనకబంధువు, తన తోఁటలోని వైద్యుతిక లోహ శలాక విషయమయి, యేదో యవసరము కలిగి ప్రధానాధికారి (యూరోపియను) మహాశయుఁడు కలకత్తానగరములో నొక ప్రాసాదమున నుండగా, నతనిఁ జూడఁబోయెను. అతని యింటిలో, లోపలి శ్రేణిలోఁ, దొడ్లలోఁ దులసి మొక్కలను వేసి పెంచి యలంకారమునకై యుంచుటఁ జూచెను. అక్కడ తులసిచెట్లు తక్క మఱేయితర పుష్పజాతులుగాని కాన రాలేదు. అప్పుఁడతనిఁజూచి, 'మహాశయా! తమతోఁటలో తులసిచెట్లు నింత యెక్కువగా కానవచ్చుచున్న వేమి?' యని యడిగెను. ఆ మాట విని 'మహాశయా! నీవు హిందువుడవయ్యు తులసి గుణము నెఱుఁగవా?' యని ప్రత్యుత్తర మిచ్చి, 'తులసి యింత యధికముగా నుంచినాగే యను మాట మీనోటివెంట వచ్చుట యంత శోభగాలేదు.' అని దొర యనగా, 'మాహిందూజాతిలో నింటింట నిది యుంచుట చిరకాలమునుండి యాచారముగా నున్నదే, కాని మీ దేశపుఁ జదువు చదివి యనేకులు దాని సమాదరించుట మఱచినారు. ఈ కారణమున మీబోఁటి ప్రధాన వైజ్ఞానిక వ్యక్తుల కీ విషయ మభిమతమని ప్రచారము చేయువలెను. అందువలన పాశ్చాత్యవిద్యావిభూషితులగు పెక్కురకు దానియందాస్థ జనింపఁగలదు.' అని బంధువనగా, విని యా దొరగారు 'మీ యింటిలో నీ చెట్టును గుఱించిన పుస్తకము లేవియు లేవా?' అని యడుగ, బంధువు "లేకేమి? బోలెఁడున్నవి. 'పెరఁటిచెట్టు మందుకు రాదు' అన్నట్లు మావారికి తమతమ దేశపువారి వ్రాఁతలు తలకెక్కవు. 'పొరుగింటి పుల్లకూర రుచి' యన్న సామెత ననుసరించి పరులవైపే వెఱ్ఱిచూపు

పడినది. ఆ శాస్త్రములయందు శ్రద్ధ లేకపోఁగా నవి యన్న వారికిఁ దలనొప్పిగా నుండును. కాని మీవంటి దొరలనోటి నుండి యే పొరపాటు మాట వచ్చినను పాశ్చాత్యభావనా భావితులైన మావారు, దానిని గురుదత్త మంత్రముగా నాదరించెదరు. అందుకొఱకే మీ యభిమత మేమని ప్రార్థించు చున్నా"నని చెప్పెను.

అంత నా విద్యుచ్ఛక్తి విజ్ఞానవేత్తయగు నా దొరగా రెంతో పట్టుదలతో, మీయొక్క వైజ్ఞానిక భాషలోఁ జెప్పుచున్నాను. వినుఁడు. "లోకములోఁ దులసిచెట్టులో నున్నంత విద్యుచ్ఛక్తి మఱి యే యితర వృక్షములలోను లేదు. ఆ తులసిచెట్లున్న ప్రదేశమునకు నాలుగువైపుల రెండువందల గజముల వఱకు గల వాయువు శుద్ధముగా నుండును. అది చలిజ్వరము (మలేరియా), మారి (ప్లేగు), ఇతర రోగములు పుట్టించు బీజాణువులను ధ్వంసము చేయును. అది చూచియే నా మెడలో నొక తులసి కట్టెముక్కను కట్టుకొన్నాను. దీని ప్రభావమువలన సంక్రామ్యముల బీజాణువులు నా శరీరములోఁ బ్రవేశింపఁజాలవు. ఇందుచేతనే నేను ప్రతి యుదయము, సాయంకాలము తులసివనములోఁ దిరుగుచుందును. ఈవిధముగా నున్నందుననే కలకత్తాలో నిట్టి మహామారియు నాజోలికి రాలేదు. నా యీ విషయమును విశ్వాసముతో మీరును అనుసరింపుఁడు."

పైనఁ జెప్పఁబడిన దొరగారు విద్యుచ్ఛాస్త్రమున గొప్ప పండితుఁడు. వైజ్ఞానికగవేషణము (Scientific research) మూలమున తులసి గుణములను పై విధముగా వివరించినాఁడు. కాని మన శాస్త్రములందు దాని గుణములు పెక్కులు అవగతములయి యున్నవి గనుకనే తులసిసేవ నానా

ప్రకారములుగాఁ జేయుట వ్యవస్థ కలదు. తులసిమాలను ధరించిన మానవశరీరమున విద్యుచ్ఛక్తి స్థిరముగా నుండును. కావున ననేక రోగములు పోయి యారోగ్యము కలుగును. శరీరమున నేరోగబీజములు ప్రవేశింపఁజాలవు. తులసి మాల ధరించువాఁ డితరులకన్న నారోగ్యవంతుఁడు, దీర్ఘజీవి, ధర్మ శీలుఁడు, సత్పథావలంబియు నగును. కావున మానవుఁ డయినవాఁడెల్లఁ దులసిమాలను ధరించుట యుచితము. ఇఁక నీకాలపు నాగరికతకు వశులయినవారు సభ్యత కనుకూలము గాదని తులసిమాలను ధరించుట కిచ్ఛగింపరు. వారు పైనఁ బేర్కొనఁబడిన దారగారివలె తులసికట్టెలో నొకటి రెండు ముక్కలు మొలలోనో లేక సందిటనో యెవరికిఁ గానరాకుండ ధరించినయెడల తమ సభ్యతకు భంగమురాకుండఁగా ఉపకార మును పొందుదురు. దీనివలన తీర్థము, స్వార్థము రెండును కలిసివచ్చునుగదా.''

నళినీబాబు మఱియు నిట్లు చెప్పినాఁడు:- 'తులసీరసము' సంధిరోగమునందు, సన్నిపాతజ్వరము (Typhoid Fever) నందెక్కువ యుపకారి. తులసిరసము శరీరమునందు దూషిత రక్తమును బాగుపఱుచును. వాతరక్తము, గళితకుష్ఠరోగ ములందుఁ బరమోపకారి. ప్రతిదినము తులసియాకులను తినఁగలిగినచో కుష్ఠరోగి యారోగ్యము నందఁగలుగును. ఆకులతోనున్న తులసికొమ్మను చేతియం దుంచుకొనిన, వాని శరీరము నెప్పుడు దోమ కాటు వేయఁజాలదు. దోమలు తులసిచెట్టు చాయలకు రాఁజాలవు. దోమలవలన మలేరియా వచ్చునను విశ్వాసము గలవారు దీనిని పరీక్షచేసి చూడ వచ్చును. తులసిరసము దేహమునకుఁ బూసికొనిన దోమ

నాటు యెక్కువగు వేయఁజాలను. సిసుగుపడినవానికి తత్క్షణము తులసి రసముతో శరీరము మర్దన చేయఁగలిగిన యెడల, తత్క్షణమే వాని శరీరమునకు విద్యుచ్చైతన్య క్రియవలనఁ గలిగిన మైకము తొలఁగి తెలివి వచ్చును. రెండువేళలఁ బ్రతి దినము తులసీ పత్రములను భక్షణ చేసినచో 'మొయిలు విడిచిన చంద్రునివలె' దేహకాంతి యుజ్జ్వలమై యుండును. తులసి యొకటియే శాస్త్రసమ్మతమైన చక్కని రసాయనము.

ప్రమదా శాబు - జ్వరము ఉబ్బసము మున్నగువ్యాధులకు తులసిరసము వాడఁదగునని వ్రాసియున్నారు. వీరనేకపరీక్షలు దీనిని గురించి చేసియున్నారు.

హిక్కా కాస విషశ్వాస పార్శ్వశూల వినాశనః ।
పిత్తకృత్ కఫవాతఘ్నః సురసః పూతిగంధ నుత్ ॥

— చరకసంహిత.

వెక్కిళ్లు, శ్వాస, కాస, విషదోషము, పార్శ్వశూల మొదలగునవి హరించును. పిత్తమును పెంచును. వాతమును, కఫమును నశింపఁజేయును.

సామాన్యా తులస్యా గుణాః కటుత్వం, తిక్తత్వం, ఉష్ణత్వం, సురత్వం (మంచివాసన), శ్లేష్మవాత జంతుభూత, కృమిశాంతి నాశిత్వం చ॥

— రాజనిఘంటు.

దాహపిత్త కారిత్వమ్; దీపనత్వమ్; కుష్ఠకృచ్ఛ్రాస్ర పార్శ్వరుక్ నాశిత్వం, శుక్లా కృష్ణా చ తులసీ గుణైస్తుల్యా; ఇతిభావప్రకాశః.

శిష్యుఁడు :- అయినచో గుణగ్రాహులగు విదేశీయులును బృందారాణి మహిమను గుర్తించియున్నారు.

గురు:- వారికి కొంతమాత్రమే తెలియును. దేహమే సర్వస్వము అనువారు దేహమారోగ్యముగా నుండఁగోరి,

తులసిని సేవించినచో, క్రమముగా వారు సాత్త్విక భావనమును బొంది శ్రీభగవానుని కృపకుఁ బాత్రులయి యుండఁ గలరను విషయమును కొంత తెలిపితిని. మఱియును వినుము. రణజిత్ సింహుఁడు యోగియు, సాధువును నగు హరిదాసును నలుబదియొక దినములు భూమిలోఁ బాతి యుంచెను. అతఁడు తులసిపత్రములే యాహారముగానుండి జీవించెను. తులసి వేరును తలయందు ధరించిన, సాధ్యము గాని గడ్డరోగములు వాసియగును. సిగమానందస్వామి తన బ్రహ్మచర్య సాధనమను గ్రంథమున 'తులసివేరు' వీర్యవర్థకమని వ్రాసెను. విషమజ్వరమున నొక చటాకు తులసి రసమును త్రాగినచో నారోగ్యము కలుగును.

కొన్ని సంవత్సరములకుఁ బూర్వ మొకఁడు హిందూస్థానీ సాధువును గుఱించి చెప్పియుండెను. ఆ సాధువొక సంవత్సర కాలము సమాధియందుండెనఁట. శిష్యు లతని బోడితల మీఁద తులసియాకులు రొట్టెవలెఁ జేసి యుంచిరఁట. దాని వలన నాహారముతోఁ బనిలేకుండఁ బోయినదఁట.

ఎవరేని జపము చేయునప్పుడు మనసు ఇతరాలోచనలతో నుండు నెడల, తిలకము నొసట నుంచుకొని తులసివనములోఁ గూర్చుండి తులసిమాలతో జపము చేసినయెడల నతిత్వరగా చిత్త మేకాగ్ర మగును. నామమందలి రస మనుభవమునకు వచ్చును. సాత్త్విక భావోదయమై మన స్సంతర్జగత్తునందుఁ బ్రవేశించును. అనఁగా ధ్యానములభించి కృతార్థుఁడగును.

ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాంస్మృతిః ।
స్మృతిలబ్ధే సర్వగ్రంథీనాం విమోక్షః ॥

ఆహారశుద్ధివలన సత్త్వశుద్ధి, సత్త్వశుద్ధివలన ధ్రువమగు స్మృతి, స్మృతిలాభముచే సకలగ్రంథులు విడిపోవును.

ఆయుః సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥

ఆయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి – వీనిని విశేషముగా వృద్ధి పొందించునవి. రసము గలిగినవి, స్నిగ్ధము(చమురు) గలవి, స్థిరములు, రుచికరములు నగు ఆహారములు సాత్త్వికులకుఁ బ్రియములు.

“ఇంద్రియై ర్విషయ గ్రహణ మాహారః”

ఇంద్రియముల మూలమున విషయములను గ్రహించుటయును ఆహారమందురు.

హరే రామ హరే రామ రామ రామ హరే హరే ।
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥

తులసీమూలమున, యీ మధురనామ కీర్తనమున, చెవుల ఆహారము శుద్ధమగును.

గంగామృత్తికతోఁగాని లేదా తులసిమృత్తికతోఁగాని, కేశవాది నామము లుచ్చరించుచు,

లలాటే కేశవం ధ్యాయే న్నారాయణ మథోదరే ।
వక్షఃస్థలే మాధవంతు గోవిందం కంఠకూపకే॥
విష్ణుం చ దక్షిణే పార్శ్వే బాహౌ చ మధుసూదనం ।
త్రివిక్రమం కంధరే తు వామనం వామపార్శ్వకే॥
శ్రీధరం వామ బాహౌ చ హృషీకేశం చ కంధరే।
పృష్ఠే తు పద్మనాభం చ కట్యాం దామోదరం స్మరేత్॥

లలాటమునఁ గేశవుని, ఉదరమున నారాయణుని, ఉరమున మాధవుని, కంఠమున గోవిందుని, కుడిప్రక్కను విష్ణుని,

కుడిభుజమున మధుసూదనుని, మెడయందు త్రివిక్రముని, ఎడమప్రక్కన వామనుని, ఎడమభుజమున శ్రీధరుని, కంధరమున హృషీకేశుని, పృష్ఠమున ప్రద్యుమ్నుని, ముచ్చిలిగుంటలో దామోదరుని ధ్యానించుచు తిలకము ధరించవలెను.

ద్వాదశాంగములందుఁ దిలకము చేసినచోఁ త్వగింద్రియము శుద్ధమగును. మునులు సమాధిబలమునఁ దిలకము ధరించుటకీ స్థానములు నిర్ణయించినారు. ఆ యాస్థానములందు మృత్తికతో లేపనము చేయుట సమస్తాంగములు పవిత్రములగుటయే కాక, యేకాగ్రతాశక్తి వృద్ధియగును. ఈ ప్రకారము లలాటమునఁ దిలకము ధరించుటచే ముఖమండలమంతయుఁ బవిత్రమగును. బాహువులందు నిర్ణీతస్థలమునఁ దిలకము ధరించుచో, బాహువులంతయుఁ బవిత్రము లగును.

ఈ తిలకము, తులసిమీఁదినుండి వచ్చుగాలి, తులసిపత్రము, తులసిమాల త్వగింద్రియమున కగు నాహారమును శుద్ధిచేయును. తులసీదర్శనమునను, శ్రీవిగ్రహదర్శనమునను చక్షుర్విషయమగు రూపము శుద్ధమగును. గంగోదకమును శంఖముతోఁగొని సాలగ్రామమున కభిషేక మొనరించి తులసిచందనముతోఁ గూడిన యాతీర్థమును పానము చేసిన యెడల రసన(నాలుక) యొక్క రసము శుద్ధమగును. పరమపవిత్రమైన తులసి ఏకాగ్రతను వృద్ధిచేయుటయందుగూడా శక్తి గలిగియున్నది. తులసి గంధమును, ధూపద్రవ్యములతోఁ బొగను వాసనచూచుటచే ఘ్రాణేంద్రియాహారము శుద్ధమగును. ఈ పంచేంద్రియముల యాహారము శుద్ధియయ్యె నేని ధ్రువాస్మృతి యనబడును. శ్రీమత్ రామానుజాచార్యస్వామి యీ

ధ్రువాస్మృతినే భక్తియనెను యోగులీ ధ్రువాస్మృతినే నిశ్చల జ్ఞానవృత్తి లేక యోగాగ్రభూమి యనిరి. ధ్రువాస్మృతి కలిగిన యెడల మానవుఁ డానంద సాగరమున మునుఁగును. ఓయీ! నీకు తులసిని గుఱించి ఇంకను వినవలెననెడి కుతూహలము యున్నదా ?

శిష్యః— దేవా! మఱి యేయే శాస్త్రములందు తులసిని గుఱించి యున్నదో దానిని చెప్పుఁడు. అంతంతకు నా కోరిక వృద్ధియగుచున్నది.

గురుః— ఇచ్ఛకలదేని సావధానుఁడవయి తులసిని సేవింపుము. దానఁ గృతార్థుఁడ వయ్యెదవు.



# సప్తమ ప్రకాశము

గురుః— అగస్త్యసంహితయందు సుతీక్ష్ణునకు అగస్త్యునకుజరిగిన సంవాదమున నీ తులసిగుణము వర్ణింపఁబడి యున్నది. తెలిపెద వినుము. సుతీక్ష్ణుఁడను ముని యగస్త్యమహర్షి నిట్లని యడిగెను.

> కి మేత ద్భగవన్ బ్రూహి హిత్వా దధ్యోదనం రమాః।
> తక్రం పిబసి మాహాత్మ్యం శ్రీతులస్యాం శ్చ విస్తృతమ్॥ ౧
>
> — అగస్త్యసంహిత. ౬ అధ్యా.

భగవన్! తామిట్లు సెలవిచ్చుచున్నారేల ? పెరుఁగన్నము మాని మజ్జిగ త్రాగుచున్నారు; శ్రీ తులసీ మాహాత్మ్యము నేల విస్తరముగాఁ జెప్పుచున్నారు ?

అగస్త్య ఉవాచ :

శ్రుణు వక్ష్యామి మాహాత్మ్యం శ్రీతులస్యాః ప్రయత్నతః।
పూర్వముగ్రం తపః కృత్వా వరం వవ్రే మనస్వినీ॥ 2

శ్రీ తులసీ మహిమ ప్రయత్నపూర్వకముగ వచించెదను వినుము. పూర్వకాలమున శ్రీ తులసి కఠోరతపము గావించి వరము పొందెను. ఆ కారణమున సర్వలోక పావనియగు శ్రీతులసి విష్ణునకు, జగదీశ్వరుఁడగు శ్రీ రామచంద్ర ప్రభువునకు శ్రీ సీతాదేవి యెంతటి ప్రియురాలో, ఆవిధముగా సమస్త పుష్పపత్రములలోఁ బ్రియతమ మైనదయ్యెను.

ఏ వ్యక్తి ప్రత్యహము తులసీపత్రములతో విష్ణువు నర్చించునో, వాఁడు పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకమున వసించును.

నల్లకలువపూలు వేయింటితో త్రిసంధ్యలందును శ్రీహరిని నూరేండ్లు పూజించినను, వాఁడు తులసితో శ్రీహరి నర్చించిన ఫలము నందఁజాలఁడు. అన్ని పుష్పములలో పద్మము శ్రేష్ఠమని చెప్పఁబడుచున్నది. కాని పద్మముకంటెను తులసి లక్ష కోట్ల మడుఁగులు ఫలము నొసఁగును. విష్ణుమంత్రోచ్చారణ పూర్వకముగ విష్ణుమస్తకమున తులసి నర్పించిన ననంతఫల ప్రదము. తులసిపత్రముల నడుమ నడుమ వివిధములగు నానా విధ పుష్పములు చేర్చి, మాలనుగ్రుచ్చి, చందనముతోఁ దడిపి యెవఁడు శ్రీరామచంద్రప్రభువు మస్తకమున భక్తితో నర్పించునో, వానికి సంపూర్ణదక్షిణలతోడి బహుయజ్ఞములు, తీర్థసేవలు, వివిధ దానములు, ఉగ్రములగు తపస్సులు అనువాని వలని ప్రయోజన మేమికలదు? వాక్సంయమము కలిగి, భగవానునియందాత్మను, మనసును నివేశింపఁజేసి, యెవఁడు తులసి

మాలలతో నర్చనచేయునో వాఁడు కోటియజ్ఞములు చేసిన ఫలము బడయును. సంసారము అనెడి చీఁకటినూఁతిలో మునిఁగి దరిదాపుఁ దోఁచనివారికి రామచంద్రునికి సమర్పించిన తులసి పుష్పఫలములే యుద్ధరింపఁ గారణములు. ముక్తిమార్గ ద్యోతకములు, సర్వసిద్ధి దాయకములు. తాను స్వయముగాఁ గొనివచ్చి మధ్యమధ్య పూవులుంచి గ్రుచ్చిన తులసీ పత్రమాల నర్పించిన మోక్షలక్ష్మి నొసఁగును.

అసంఖ్యాక పుష్పవృక్షములచే శోభించు తులసీవాటిక యేతావున నుండునో ఆ తావున శ్రీ సీతాసమేతుఁడయి శ్రీరామప్రభువు వాసము చేయును.

భక్తితో యే బుద్ధిమంతుఁడు తులసీవనమును వేసి, దానిచుట్టు ముండ్లకంచెను పాతి కాపాడునో, వాని కదియే ముక్తికిఁ గారణము. దానికంటె నుత్కృష్టమైనది యేదియు లేదు. తులసీదళములతో వాసితమై సాలగ్రామశిలాసంస్పర్శ గల జలము నెవఁడు పానము చేయునో, వాఁడు మరల తల్లి చనుఁబాలు చవిచూడఁడు. జలములందు గంగాజలమువలెను, పూజ్యులందు శ్రీరామచంద్రునివలెను, పుష్పములందు పద్మమువలెను – తులసీపత్రము ప్రశంసనీయము. తులసీపత్రములతో శ్రీరామచంద్రప్రభువును బూజచేసెనేని జన్మాంతర సహస్రములనుండి వెన్నంటివచ్చు దుఃఖరాశి రూపుమాసి పోవును.

ఓ తపోధనా! బ్రాహ్మణాది వర్ణచతుష్టయమునకు, బ్రహ్మచర్యాది యాశ్రమములకు ఏయే పూజ ప్రధానకార్యమని నిర్దేశింపఁబడియున్నదో వారికి తులసీపత్రములతోడి పూజయే

యభీష్టముల నొసఁగు సాధనము. పూజకు యోగ్యములగు దళములు, పత్రములు, పుష్పములు - వీనితో నెవఁడు హరినిఁ బూజించునో, వాఁడు చేయు కర్మ మంగహీనమైనను సఫలమే యగును. పాపియేగాని, పుణ్యాత్ముఁడేగాని యెవఁడైన నగుఁ గాక - తులసీపత్రములతో హరి నర్చించెనేని వాఁడు నరక యాతన లనుభవింపఁడు. సత్యము - సత్యము. దీనికి సంశ యము లేదు.

కనులు మూసికొని, హృదయమున శ్రీరామచంద్ర ప్రభువును ధ్యానము చేయుచు, తులసీపత్రములతోఁ జేరిన గంగాజలముతో నెవఁడు పూజచేయునో, ఎవఁడు శ్రీరామ చంద్రప్రభువు మస్తకమునందు బహువారములుగాని, యేక వారముగాని రామమంత్రముతో నభిషేచన మొనరించునో, వాఁడెల్లరకు ధ్యేయుఁ డగును. ఇదియే ముక్తి బడయుటకు నదుపాయము. ఎవనికి మంత్రోపదేశ మొనరించు గురువు లేఁడో, ఎవనికి మంత్రమును గ్రహించునప్పుడు శాస్త్రప్రణాళిక లభిం పదో వాఁడు 'రామ' అను రెండక్షరము లుచ్చరించి యుచ్చ రించి తులసీదళము లర్పణముచేయునో, వాఁడు విభిన్నములగు నూర్ల దీక్షాగ్రాహులందును లభింపఁడు.

దీక్షితేష్వపి సర్వేషు రామ దీక్షిత ఉత్తమః।
న గురుర్నైవ కాలంచ న దేవాంతరసేవనః।
తులసీ దళయుక్తంచ రామార్చన మపేక్షతే॥

సమస్త దీక్షితులలో రామమంత్ర దీక్షితుఁడే యుత్త ముఁడు. తులసీదళములతో శ్రీరామార్చనము - గురువును గాని, కాలాకాలములనుగాని, దేవతాంతర సేవనమునుగాని, యపేక్షింపదు. ఎవఁడు నిర్మాల్య తులసి మాలను ధరించి

శ్రీహరిని పూజించునో లేదా యేయే కర్మ మొనరించునో, యదియంతయు ననంత ఫలదాయక మగును. శ్రీరాముని ఆరాధనమందు ద్రవ్యాదులు లోపమయ్యేనేని, ఒక తులసి పత్రములోఁ బూజించిన, నది పరిపూర్ణ మగును.

> సాలగ్రామ శిలాయాశ్చ గంగాయాశ్చ తపోధన ।
> తులస్యాశ్చైవ మాహాత్మ్యం నేష్టై ర్వక్తుం హి విశ్వసృక్॥
> భవభంజనమే తత్తే సర్వాభీష్టం ప్రయచ్ఛతి।
> నాతః పరతరం కించిత్ పావనం విద్యతే భువి॥

ఓ తపోధనుఁడా! సాలగ్రామశిల యొక్కయు, గంగ యొక్కయు, తులసియొక్కయు మాహాత్మ్యము వర్ణింప బ్రహ్మయును సమర్థుఁడు కాఁడు. భవభయహారిణి యగు తులసి నీ సర్వాభీష్టముల నొసఁగును. తులసికంటె పవిత్ర మైనది జగత్తున మఱేదియు లేదు.

> యః కుర్యా త్తులసీకాష్ఠై రక్షమాలాం సురూపిణీమ్।
> కర్ణ మాలాం చ యత్నేన కృతం తస్యాక్షయం భవేత్॥

ఏ వ్యక్తి తులసి కట్టెతో సుందరమగు జపమాలను, కర్ణమాలను చేయునో, వాఁడు చేసిన కర్మ మక్షయమగును.

> సంఘృష్య తులసీకాష్ఠం యో దద్యా ద్రామమూర్ధని ।
> కర్పూరాగరు కస్తూరీ చందనం చ న తత్సమమ్॥
> తులసీ విపిన స్యాపి సమస్తాత్ పావనం స్థలమ్ ।
> క్రోశమాత్రం భవత్యేవ గాంగేయస్యేవ పాథసః॥
> తులస్యా రోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పావయేత్ ।
> ఆరాధితా ప్రయత్నేన సర్వకామ ఫలప్రదా॥

తులసికట్టెతోఁ దీసిన గంధ మేవ్యక్తి శ్రీరామచంద్ర ప్రభువు మస్తకమున నుంచునో, కర్పూరము చందనము

కస్తూరి నొసగినను దానికి సాటిరావు. తులసివనము నలుగడల నొక క్రోసుదూరము వఱకుఁ గల స్థలము గంగాజలమువలె పవిత్రమైనది. తులసిని నాటినను, చెట్టుకు నీరు పోసినను, చూచినను, తాఁకినను పవిత్రము చేయును. శ్రద్ధతో నారాధించినచో సర్వకామముల సిద్ధింపఁజేయును.

ఓ మునివరా! ఎవరు ప్రతిదినము తులసికిఁ బ్రదక్షిణము చేసి నమస్కారము చేయుదురో వారి పాపమంతయు నశించును. కొంచెమేని శేషించియుండదు.

అనన్యదర్శనాత్ ప్రాతర్యే పశ్యంతి తపోధన ।
అహోరాత్ర కృతం పాపం తత్ క్షణాత్ ప్రదహంతి తే॥
తులసీ సన్నిధౌ ప్రాణాన్ యే త్యజంతి మునీశ్వర !
న తేషాం నరకక్లేశం ప్రయాంతి పరమం పదమ్॥

ఎవరు ప్రొద్దున లేవఁగానే మఱియెవరిని చూడక తులసిని దర్శించెదరో వారికి రాత్రి పగలు చేసిన పాపము క్షయించును. మునీశ్వరా! తులసి సన్నిధిలో ప్రాణములు విడిచినవారికి నరకయాతనలు లేవు. వారు పరమపదమున కేగెదరు.

విధేయ మవిధేయం వా న్యూన మప్యధవాధికం ।
తులసీదళ మాదాయ రామం ధ్యాత్వా సమర్పయేత్॥
రామాయ నమ ఇత్యే తదచ్యుతాయ నమ స్తతః ।
అనంతాయ నమ స్తస్మాత్ ప్రణవాది వదేదిదమ్॥

విధివంతముగాఁ గాని, అవిధిగాఁ గాని, లొచ్చుగాఁ గాని, హెచ్చుగాఁగాని తులసిదళములను గొని శ్రీరామప్రభువును ధ్యానించి సమర్పింపవలయును. ఓం శ్రీరామాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం అనంతాయ నమః - అని యిట్లు ప్రణవాదిగా నమోంతముగాఁ జెప్పి సమర్పింపవలయును.

క్రుతం సఫలతా మేత్రి తులసీ సన్నిధౌ మునే!
త దేవ పుణ్యకాలేషు సహస్రగుణితం భవేత్॥

సాలగ్రామశిలాయా శ్చ తులస్యా శ్చైవ సన్నిధౌ।
యేషాం పుణ్యవతాం మృతు స్తే ముక్తా నాత్ర సంశయః॥

ఓ మునివరా! తులసీ సన్నిధిలో నెవఁ డేది అనుష్ఠించినను నది సఫలమగును. వాఁడుగనుక పుణ్యాము చేసెనా యది వేయి మడుఁగులగును. సాలగ్రామసన్నిధిలోఁగాని, తులసిసన్నిధిలోఁ గాని నే పుణ్యాత్ముఁడు మరణించునో వాఁడు ముక్తుఁడగును. ఈ విషయమున నేమి సందేహము లేదు.

అగస్త్యమహాముని యీ ప్రకారము సుతీక్ష్ణునకు తులసీ మహిమను జెప్పెను. — అగస్త్యసంహిత



# అష్టమ ప్రకాశము

శిష్యుఁడు:- దేవా! తులసీ మాహాత్మ్య మింకను జెప్పుఁడు.

గురు:- స్కాందపురాణ నాగరఖండములో ౨౪౯ అధ్యాయమునందు తులసీదేవి మాహాత్మ్యము ఇట్లు జెప్పఁబడి యున్నది. దానిని జెప్పెదను వినుము.

వాణ్యువాచ:—

తులసీ రోపితా యేన గృహస్థేన మహాఫలా।
గృహే తస్య న దారిద్ర్యం జాయతే నాత్ర సంశయః॥ ౧

ఏ గృహస్థుని గృహమున తులసి పెంచఁబడునో ఆ గృహమున దారిద్ర్య ముండదు. ఇందుకు సందేహము లేదు.

తులస్యా దర్శనా దేవ పాపరాశి ర్నివర్తతే।
శ్రియోఽమృత కణోత్పన్నా తులసీ హరివల్లభా॥ ౨

పిబంత్యా రుచిరం పానం ప్రాణినాం పాపహారిణీ ।
యస్యా రూపే వసేల్లక్ష్మీః స్కంధే సాగరసంభవా॥ 3

పత్రేషు సతతం శ్రీశ్చ శాఖాసు కమలా స్వయమ్ ।
ఇందిరా పుష్పగా నిత్యం ఫలే క్షీరాబ్ధిసంభవా॥ ౪

తులసిని దర్శించినమాత్రనే పాపరాశి నశించును. తులసి శ్రీవృద్ధి కారణము. తులసి యమృతపుబొట్టువలనఁ బుట్టినది. ఇందువలన హరివల్లభ యయినది. తులసి మొదట శుద్ధోదక ముచే నభిషేకించిన ప్రాణుల పాపమును హరించును. ఆ తులసి రూపమున – లక్ష్మి, స్కంధమున – సాగరసంభవ, పత్ర ముల – సతతశ్రీ, శాఖలయందు – స్వయము కమల, పుష్ప ముల – నిత్యముగ నిందిర, ఫలములందు – క్షీరాబ్ధిసంభవ.

తులసీ శుష్కకాష్ఠేషు యా రూపా విశ్వరూపిణీ ।
మజ్జాయాం పద్మవాసా చ త్వచాసు చ హరిప్రియా॥ ౫

ఎండిన కట్టెయందు విశ్వరూపిణియు, మజ్జయందు పద్మ వాసయు, తొటయందు హరిప్రియయు వాసము చేయును.

సర్వరూపా చ సర్వేశా పరమానందదాయినీ ।
తులసీ ప్రాశకో మర్త్య యమలోకం న గచ్ఛతి॥ ౬

శిరస్థా తులసీ యస్య న యాన్తైరను భూయతే ।
ముఖస్థా తులసీ యస్య నిర్వాణ పదదాయినీ॥ ౭

తులసి – సర్వరూప, సర్వేశ్వరి, పరమానందదాయిని. తులసిని భక్షించు మానవుఁడు యమలోకమునకుఁ బోఁడు. తులసి మస్తకమునను్నవానికి యమదూతల భయముండదు. ముఖమునందున్న తులసి నిర్వాణపదము నొసఁగును.

హస్తస్థా తులసీ యస్య స తాపత్రయవర్జితః ।
తులసీ హృదయస్థా చ ప్రాణినాం సర్వకామదా॥ ౮

స్కంధస్థా తులసీ యస్య స స్నాపై ర్న చలిప్యతే।
కంఠస్థా తులసీ యస్య జీవన్ముక్తః సదా హి సః॥ ౯
తులసీ సంభవం పత్రం సదా వహతి యో నరః।
మనసా చింతితాం సిద్ధిం సంప్రాప్నోతి న్న సంశయః॥ ౧౦

ఎవనిహస్తములందు తులసి యుండునో వాఁడు తాపత్రయములకు లోఁబడఁడు. హృదగుమందున్న తులసి ప్రాణులకు సర్వకామముల నొసఁగును. ఎవనిమూపున తులసి యుండునో వానిని పాపము లంటవు. కంఠమున తులసి కలవాఁడు జీవన్ముక్తుఁడు. ఏ మానవుఁడు తులసిపత్రములను సదా వహించునో వాని యభిలషితములన్నియు సిద్ధించును.

తులసీం సర్వకార్యార్థ సాధనీం దుష్టచారిణీమ్।
యో నరః ప్రత్యహం సించే న్న స యాతి యమాలయమ్॥

చాతుర్మాస్యే విశేషేణ వందితాపి విముక్తిదా।
నారాయణం జలగతం జ్ఞాత్వా వృక్షగతం తథా॥

ప్రాణినాం కృపయా లక్ష్మీ స్తులసీ వృక్షమాశ్రితా।
చాతుర్మాస్యే సమాయాతే తులసీ సవితా యది॥

తేషాం పాపసహస్రాణి యాంతి నిత్యం సహస్రధా।
గోవిందస్మరణం నిత్యం తులసీవన సేవనమ్॥

తులసీసేచనం దుగ్ధై శ్చాతుర్మాస్యేఽతి దుర్లభమ్।
తులసీ వర్ధయేత్ యస్తు మానవో యది శ్రద్ధయా॥

ఆలవాలాంబు దానైశ్చ పావితం సకలం కులమ్।
యథా శ్రీ తులసీసంస్థా నిత్య మేవహి వర్ధతే॥

తథా తథా గృహస్థస్య కామవృద్ధిః ప్రజాయతే।
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతి స్తథా॥

తథా ప్రకృతియః సర్వా స్తులసీ సేవనేరతాః।
శ్రద్ధయా యది జాయంతే న తాసాం దుఃఖదో హరిః॥

సర్వకామముల నిచ్చునదియు, అనిష్టములఁ బోఁగొట్టు నదియు నగు శ్రీ తులసి నెవ్వఁడు ప్రత్యహము నీటిచే సేచనము చేయునో వాఁడు యమాలయమునకుఁ బోఁడు. చాతుర్మాస్య మున విశేషించి వందన మాచరించిన విముక్తి నొసఁగును. లక్ష్మీదేవి - శ్రీనారాయణుఁడు జలగతుఁడని, వృక్షగతుఁడని తెలిసి ప్రాణులయందలి కృపచేత తులసీవృక్షము నాశ్రయించెను. ఎవరు చాతుర్మాస్యలో తులసిని సేవించెదరో వారి వేవేలపాపములు వేలవేలభాగములుగా విరిసిపోవును. గోవింద స్మరణము, తులసీవనసేవ, పాలతో తులసిని నభిషేకించుట - ఇవి చాతుర్మాస్యలో నధిక ఫలములు. ఏమానవుఁడు శ్రద్ధతో పాదుచేసి నీరుపోసి తులసిని పెంచునో, వాని కులము పవిత్రమగును. ఏయే విధముగా తులసియందున్న శ్రీ నిత్యము పెంచఁబడునో యాయా విధముగా గృహస్థుని కామములు వృద్ధియగును. (మనస్సునందలి కోరికలు నెరవేఱును) బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, యతియును, సమస్త సాధారణ ప్రకృతిపుంజము శ్రద్ధాపూర్వకముగా తులసిని సేవించిన యెడల హరి వారికి దుఃఖముల నీయఁడు.

ఏకో హరిః సకలవృక్షగతో విభాతి
నానారసైస్తు పరిభావిత మూర్తి రేవ ।
వృక్షాధివాస మగమత్ కమలాచ దేవీ
దుఃఖాది నాశనకరీ సతతం స్మృతాపి॥

నానారస పరిపూర్ణుఁడయిన శ్రీహరి సకలవృక్షగతుఁడయి విశేషముగఁ బ్రకాశించుచుండును. సతతము స్మరించువారి దుఃఖమునునశింపఁజేయు కమలాదేవి వృక్షముల నధివసించెను.

శిష్యుడు:- దేవరవారి శ్రీముఖమునుండి తులసీమాహాత్మ్యము నెంత వినినను మఱియు వినవలెననెడి పిపాస యధికమగు చున్నది. స్వామీ! దేవీ మాహాత్మ్యమును నింకను జెప్పుడు.

గురు:- పద్మపురాణమునందు త్తరఖండమున దులసిని గుఱించి తెలిపిన విషయము చెప్పెద వినుము.

జలంధరునిపత్ని బృంద. అతి లావణ్యావతి. ఆ సతి లావణ్యాతిశయమునుగాంచి విష్ణువు మోహనిమగ్నుడయ్యెను. ఆ ప్రభు మోహమును నివారించుటకు దేవతలు మహాదేవుని నాశ్రయించిరి. మహాదేవుడు దేవతలతో 'మాయ' నారాధింపుడని చెప్పెను. దేవతలు మాయను స్తోత్రము గావించిరి. మాయ వారితో 'రజస్సత్త్వతమోగుణములచే గౌరి, లక్ష్మి, స్వధ అను రూపములతో నున్నారు. వారు మీ కార్యవిధాన మాచరించెదరు.' ఆ మాట విని సురగణము వారి సమీపమున కేగి ప్రణామము గావించిరి. ఆ గౌరీ లక్ష్మీ స్వధాదేవులు దేవతలకు కొన్ని విత్తనములిచ్చి, వీనిని విష్ణువున్నతావున చల్లుడని చెప్పిరి. ఆ ప్రకారమే దేవతలు చేసిరి. ఆ విత్తనములు మూడు వృక్షములయ్యెను. 1 ధాత్రి (ఉసిరిక), 2 మాలతి, 3 తులసి. ధాత్రి - స్వధాంశము. మాలతి - లక్ష్మిఅంశము. తులసి- గౌరి యంశముగా నుత్పన్నము లయ్యెను.

శిష్యుడు:- జలంధరుం డెవడు?

గురు:- ఇంద్రుండు శివదర్శనముచేయ మనసు కలిగి శివలోకమునకుం బోవ, నొక భయానకపురుషుండు కానవచ్చెను.

ఈశ్వరుఁ డెక్కడకు బోయెనని యెంత యడిగినను సమాధాన మిచ్చినవాఁడు కాఁడు. ఇంద్రుఁడు క్రుద్ధుఁడై వజ్రాయుధముతో నతనిఁ గొట్టెను. అప్పుడు రుద్ర తేజమువలన మంట బయలువెడలెను. అది గని యింద్రుఁడు భయపడి ప్రణామ మొనరించి, స్తవముగావించెను. రుద్రుఁడు సంతోషించి, యింద్రుని మాడ్చివేయుటకు ఫాలనేత్రమునుండి వెలువడిన నగ్నిని గంగాసాగరమునం దుంచెను. అప్పుడా యగ్ని బాలరూపమును ధరించి, రోదన మొనరింప సాగెను. వాని రోదనశబ్దమునకు సప్తలోకములు బధిరప్రాయములాయెను. అది విని బ్రహ్మ విస్మితుఁడై యచ్చోటి కేగి సముద్రుని యొడియందున్న నాబాలకుని జూచి 'యీ కుఱ్ఱ డెవఁ'డని ప్రశ్నించెను. సముద్రరాజు 'వీఁడు నాబిడ్డఁడు. వీనికి జాతకర్మాదులు చేయుఁ'డని శిశువును బ్రహ్మచేతి కందించెను. ఆ బాలకుండు బ్రహ్మగడ్డము పట్టుకొని చిట్టిచేతులతో వెంట్రుక లాడింపఁగా బ్రహ్మకు రెండు కనుల నుండి నీరు వెడలెను. అప్పుడు 'ఏకారణమున నా కనుల వెంట నీ రా బాలకునివలనఁ గలిగెనో, ఆ కారణమున నీ పిల్లవానిపేరు జలంధరుఁ'డని నామకరణముచేసి 'యిప్పుడే వీఁడు సర్వశాస్త్రవేత్త యగును. రుద్రుడుగాక యేయితర భూతములు నితనిని జంపజాలవు.' అని చెప్పి శుక్రుని బిలిచి యసురరాజ్యమునకు జలంధరుని రాజుగా నభిషిక్తుని జేయించెను. అతఁడు కాలనేమికూతు బృందను వివాహమాడెను.

— పద్మపురాణము, ఉత్తరఖండము.

శిష్యుఁడు:- స్వామీ! తులసీ మాహాత్మ్యమును మఱియుఁ దెల్పుఁడు.

గురు:- పద్మపురాణమున నుత్తరఖండమునఁ జెప్పఁబడిన తులసీ మాహాత్మ్యమును జెప్పెద వినుము.

బ్రహ్మోవాచ:—

తులస్యా శ్రుణు మాహాత్మ్యం పాపఘ్నం సర్వకామదమ్।
యత్ పురా విష్ణునా ప్రోక్తం తత్ తే వక్ష్యామ్యశేషతః॥

పాపములను నశింపఁజేసి సర్వకామముల నిచ్చు తులసి మహిమను వినుము. ఈ మాహాత్మ్యమును తొల్లి శ్రీమహా విష్ణువు చెప్పెను, దానిని సమస్తము నీకుఁ జెప్పెదను.

కార్తిక మాసమున తులసి పత్రములతో పెద్దవారికి, తులసీపూజ చేయుట కర్తవ్యము. కార్తికమున దర్శనము, స్పర్శనము, ధ్యానము, ప్రణామము, పూజ, రోపణము (నాటుట), సేచనము, సేవనము చేసినచో యుగములం దార్జించిన పాపమును తులసి నశింపఁ జేయును. ఓ ద్విజసత్తమా! యెనిమిది ప్రకారములఁ దులసిని సేవించిరేని, వారు వేవేల కోట్ల సంవత్సరములు హరి మందిరమున వాసము చేయుదురు. నాటిన తులసివేరు యెంత విస్తరించునో, అన్ని యుగ సహస్రములు వారి వారి సుకృతమును విస్తరింపఁ జేయును. కార్తికమాసమునఁ దులసీపుష్పముల నెవరు హరికి నర్పించెదరో వారి జన్మమున నార్జించిన పాపము నశించును. వసుధాతలమున నాటిన తులసి యెంత వృద్ధిపొందునో, యన్ని సహస్రకల్పములు ఆ నాటినవాఁడు విష్ణులోకమునఁ బూజింపఁబడును. సమస్త పుష్పములతో పత్రమాలతో విష్ణువును బూజించిన నెంత ఫలము కలుగునో, యొక తులసి మాలతో సగముతోఁ జేసినపూజ యాఫలము నొసఁగును.

తులసీ గంధ మాదాయ యత్ర గచ్ఛతి మారుతః।
దిశోదశ పునాత్యాశు భూతగ్రామాం శ్చతుర్విధాన్॥

తులసి గంధమును గొని వాయు వెంతదూరము పోవునో, యా పదిదిక్కుల నున్న నాలుగు విధములయిన భూత సమూహములు పవిత్రములగును. ఓ మునీ! తులసీకాననముయొక్క ఛాయ యెచట కలదో, ఆ స్థానమున పితృదేవతల తృప్తి కొఱకు శ్రాద్ధముచేయుట కర్తవ్యము.

తులసి విత్తనములెల్ల నేతావున పడునో, యా తావు పితృగణములకు ప్రీతిని వృద్ధిపొందించునది. ఓ ద్విజశ్రేష్ఠా! యేగృహమునందు తులసియందలి మృత్తిక కలదో, యా గృహమును యమభటులు త్రొక్కజాలరు. తులసియందలి మృత్తికతో నలికిన స్థలమున నెవడు ప్రాణము విడుచునో, వాడు నూఱు జన్మల పాపములనుండి విముక్తుడగును. యముడు వాని దిక్కు తొంగిచూడలేడు.

తులసీ మృత్తికా లిప్తం లలాటం యస్య దృశ్యతే।
కులం స్పృశతి నో తస్య కలి ర్మని వరోత్తమ॥

ఓ మునివరోత్తమా! యెవని నుదుట తులసి మృత్తికతో లిప్తమై కానవచ్చునో, వాని కులమును కలి స్పృశింపలేడు.

కార్తికమాసమున తులసి మూలమున దీపమునుంచు వాడు కేశవునకు ప్రియుడై, వైకుంఠమున నివాసము చేయును.

తులసీకాననం చైవ గృహే యస్యావతిష్ఠతే।
తద్గృహం తీర్థభూతం హి నా యాంతి యమకింకరాః॥

ఏ గృహమున తులసీవనముండునో అది తీర్థస్వరూపమే. యమకింకరులచ్చోటికి రాజాలరు. నర్మదాదర్శనము, గంగా

స్నానము, తులసీకానన సంసర్గము - యీ మూఁడు సమాన ఫలదాయకములు.

రోపణము (నాటుట), పాలనము (పెంచుట), సేవ, దర్శనము, స్పర్శనము గావించినయెడల మానవుఁడు వాఙ్మనఃకాయములచేఁ జేసిన పాపము నశించును. తులసిమంజరులతో నెవ్వఁడు భక్తి హరినిఁ బూజించునో వాఁడు మోక్షమునుబొందును. వాఁడు గర్భగృహమునకు రాఁడు (అనఁగా మరల జన్మమెత్తఁడని భావము.)

> పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాః సరిత స్తథా।
> వాసుదేవాదయో దేవా వసంతి తులసీదళే॥

పుష్కరము మున్నగు తీర్థములు, గంగ మొదలుగాఁగల నదులు, వాసుదేవుఁడాదిగాఁగల దేవతలు తులసీదళమున వసించెదరు.

తులసీమంజరీ యుక్తుఁడయి యెవఁడు ప్రాణము విడుచునో వాఁడు శతాపరాధియైనను వానిని యముఁడు దర్శింప సమర్థుఁడు కాజాలఁడు. వింటివా? ఇంకను వినవలెనన్న యాశ కలదా?

శిష్యుఁడు:- తాము సెలవిండు. తులసీమహిమ శ్రవణమునకై నా ప్రాణమున నాశ సంచారము చేయుచున్నది. తులసీ సేవవలన హరిభక్తి యవశ్యము పొందగలనని తెలియగలిగితిని.

గురు:- పద్మపురాణమునందుఁ గ్రియాయోగసార ప్రకరణమున నే తులసీమాహాత్మ్యము వివరింపఁబడి యున్నదో దానిని జెప్పెద వినుము.

యత్రైవ తులసీ వృక్ష స్తిష్ఠతి ద్విజసత్తమ।
తత్రైవ త్రిదశాః సర్వే బ్రహ్మ విష్ణు శివాదయః॥

ఓ ద్విజసత్తమా! యే తావున తులసీవృక్షము ముండునో ఆ తావున బ్రహ్మ, విష్ణువు, శివుడు మున్నగు దేవతాగణములు వాసము చేయును. తులసిపత్రము నడుమ కేశవుడు, అగ్రమున బ్రహ్మ, పత్రముయొక్క వృంతము (కాడ) న శివుడు సర్వదా వసించియుందురు. లక్ష్మి, సరస్వతి, గాయత్రి, చండిక, శచి, యితర దేవపత్నులు తులసీపుష్పములందు వాసము చేయుదురు. ఇంద్రుడు అగ్ని, యముడు, నిఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు శాఖలయందుందురు.

ఆదిత్యాది గ్రహములు, సమస్త విశ్వేదేవతలు, వసువులు, మనువులు, అఖిల దేవర్షులు, సకల విద్యాధరులు, గంధర్వసమూహము, సిద్ధులు, అప్సరసలు తులసీపత్రము నాశ్రయించి సర్వదా వాసము చేయుదురు. తులసిపాదునందున్న గడ్డి మొదలగు కలుపు మొక్కలను తీసివేసిన వాని దేహమునందున్న బ్రహ్మహత్యాది పాపములను శ్రీహరి తత్క్షణము పోగొట్టును. ఓ ద్విజశ్రేష్ఠుడా! యెండకాలమున సుగంధ శీతల జలముతో తులసిని తడుపువాడు నిర్వాణముక్తిని బడయును. ఏ వ్యక్తి విశేషించి గ్రీష్మఋతువున తులసికి చల్లని నీడను కల్పించునో, లేదా గొడుగును పట్టునో వాడు సమస్త పాపములనుండి ముక్తుడగును. వైశాఖమాసమున నే వ్యక్తి తులసి నక్షత జలధారలతో సేచనము గావించునో వాడు నిత్య మశ్వమేధయజ్ఞ ఫలమునుబొందును.

పాలతో తులసిని సేచనము చేయువాని గృహమున లక్ష్మి నిశ్చలముగా నుండును.

తులసి మొదలునందు గోమయముతో నలికినను, మార్జనము గావించినను గలుగు ఫలము చెప్పెదను విను. ఓ జైమినీ! తులసిమూలమున నెంతదుమ్ము నేవ్యక్తిచే దూరము చేయఁబడెనో, అన్ని సహస్రకల్పములు బ్రహ్మలోకమున నావ్యక్తి నానందముగా వాసము చేయును.

యః ధర్మకర్మ కురుతే మనుజః పృథివ్యాం
నారాయణప్రియతమాం తులసీం వినా చ।
తత్సర్వమేవ విఫలం భవతి ద్విజేంద్ర
పద్మేక్షణోఽపి నహి తుష్యతి దేవదేవః॥

భూమియందే మనుష్యుఁడైన నారాయణునికిఁ బ్రియతమయగు తులసిలేకుండఁజేయు ధర్మకర్మములెల్ల విఫలములే. దేవదేవుఁడుగాని, కమలలోచనుఁడుగాని సంతోషింపఁడు.

యస్యాస్యాత్ తులసీ పత్రం ముఖే శిరసి కర్ణయోః।
మృత్యుకాలే ద్విజశ్రేష్ఠ తస్య స్వామీ న భాస్కరః॥

మృత్యుకాలమున నెవని ముఖమున, మస్తకమున, కర్ణములయందు తులసి పత్రము లుండునో యమునికి వాని మీఁద పెత్తనము లేదు. అనఁగా వైకుంఠమునకుఁ బోవునని తాత్పర్యము. ఈవిధముగా తులసీ మాహాత్మ్యము పద్మ పురాణము నందలి క్రియాయోగ సారమున నుల్లేఖింపఁ బడి యున్నది.

---

# నవమ ప్రకాశము

గురు:- వత్సా! కేవలము నానా శాస్త్రము లందుఁ జెప్పఁబడిన తులసీమాహాత్మ్యము వినుటలో నీకు ధైర్యము చెడలేదు కదా?

శిష్యు:- లేదు-దేవా! ధైర్యము చెడలేదు. నావంటి దిక్కుమాలినవాని కింత కాలమునకు వినుట గలిగినదికదా యని తలఁచుకొని మాటి మాటికి గగుర్పాటు కలుగుచున్నది. నేనే తమ శ్రీముఖమునుండి తులసీ మాహాత్మ్యమును విని కేవలము తులసీసేవ వలననే భగవంతునియందు భక్తి కలుగఁగలదని స్థిరనిశ్చయము చేసికొన్నాఁడను.

గురు:- మంచిది విను. క్రియా యోగసారమునందు తులసీ చయన (కోయు) మంత్రము—

మాత స్తులసి గోవింద హృదయానంద కారిణీ।
నారాయణస్య పూజార్థం చినోమి త్వాం నమోఽస్తు తే॥

కుసుమైః పారిజాతాద్యైః సుగంధై రపి కేశవః।
త్వయా వినా నైవ తృప్తిః చినోమి త్వా మతః శుభే॥

త్వయా వినా మహాభాగే, సమస్తం కర్మ నిష్ఫలమ్।
అత స్తులసిదేవి త్వాం చినోమి వరదా భవ॥

చయనోద్భవ దుఃఖం యద్దేవి తే హృది వర్తతే।
తత్ క్షమస్వ జగన్మాత స్తులసి త్వాం నమామ్యహమ్॥

తల్లీ! తులసి! గోవిందుని హృదయమున కానందము గలిగించుదానవు. శ్రీమన్నారాయణుని పూజ నిమిత్తము సంగ్రహించుచున్నాను. నీకు నమస్కారమగుత! మంచి వాసనగల పారిజాతము మున్నగు పూలెన్నియున్నను నీవు

లేనిది కేశవునకుఁ దృప్తి లేదు. కావున నిన్ను సంగ్రహింప వలసి వచ్చినది మహాభాగా! నీవు లేనిది సమస్తకర్మములు నిష్ఫలములు. తులసీదేవీ! అందువలన నేను నిన్ను గ్రహించు చున్నాను. వరము లిచ్చుదానవు కమ్ము. చిదుముటవలన నీ మనస్సునకు నొప్పి కలుగును. జగన్మాతా! తులసీ! నన్ను క్షమింపుము. నీకు నమస్కారము.

వైష్ణవుఁడు కృతాంజలియై యీమంత్రమును బఠించుచుఁ గొమ్మ కదలనీయక నెమ్మది నెమ్మదిగా తులసి పత్రములను చయనము చేయవలెను. తులసి సంగ్రహించునప్పుడు తులసి కొమ్మ విఱిగినయెడల తులసీపతి మనస్సునకు వ్యథ కలుగును.

పద్మోత్తరఖండమున తులసీమాలా సంబంధమునఁ జెప్పఁ బడియున్నది.

> సాత్వతై స్తులసీ కాష్ఠ మాలా కుంజ సముద్భవా।
> ధార్యా నిత్యం ప్రయత్నేన త్వేత ద్భక్తస్య లక్షణమ్॥

తులసికట్టెతోఁ జేయఁబడిన మాలను భక్తులు నిత్యము ధరింపవలెను. అది భక్తుల లక్షణము.

> హరిభక్తస్య తులసీ కుంజ కాష్ఠోద్భవా।
> చిహ్నార్థ మాత్మనో మాలా పురా కృష్ణేన దర్శితా॥
> — బ్రహ్మవైవర్తము ఉత్తరఖండము.

హరిభక్తునికి తులసీకాష్ఠ మాలాధారణము చిహ్నమని పూర్వము శ్రీకృష్ణభగవానుఁడు సెలవిచ్చియున్నాఁడు. తులసీ మాహాత్మ్యము దేవీభాగవతమునందు గలదు.

> స స్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః।
> తులసీపత్రతోయే చ యోఽభిషేకం సమాచరేత్।

గవా మయుతదానేన యత్ఫలం లభతే నరః ।
తులసీపత్రదానేన తత్ఫలం కార్తికే సతి॥
తులసీ తోయ కణికా మృత్యుకాలే చ యోలభేత్ ।
రత్నయానం సమారుహ్య వైకుంఠం స ప్రయాతి చ॥
త్రికాలం తులసీపత్రం శుద్ధం పర్యుషితం సతి ।
శ్రాద్ధే వ్రతే వా దానేవా ప్రతిష్ఠాయాం సురార్చనే॥
భూగతం తోయపతితం యద్దత్తం విష్ణవే సతి ।
శుద్ధంతు తులసీపత్రం క్షాళనా దన్య కర్మణి॥
తులసీకాష్ఠ నిర్మాణ మాలాం గృహ్ణంతి యే నరాః ।
పదేపదేఽశ్వమేధానాం లభంతే నిశ్చితం ఫలమ్॥

తులసిపత్రములున్న నీటిలో నెవఁడు స్నానముచేయునో వాఁడు సర్వతీర్థములందు స్నానమాడినవాఁడే, సర్వయజ్ఞములందు దీక్షితుఁడయినవాఁడే. పదివేల గోవులను దానము చేసిన నెంతఫలము కలదో కార్తికమాసమున నొక తులసి పత్రము సమర్పించిన నంతే ఫలము గలదు. మరణకాలమున తులసి తీర్థ మొక చుక్క లభించినను వాఁడు రత్నవిమానమెక్కి వైకుంఠమునకుఁ బోవును. పర్యుషితమయిన దైనను తులసీపత్రము శుద్ధమైనదే. శ్రాద్ధమునందుఁగాని, వ్రతమునందుఁగాని, దానమునందుఁగాని, ప్రతిష్ఠయందుఁగాని, దేవపూజయందుఁగాని నేలమీద పడినదైనను నీటియందు పడినదైనను, విష్ణువున కర్పించినదైనను క్షాళనము చేసినయెడల పైని జెప్పిన కర్మలయందు పనికివచ్చును. అది శుద్ధమైనదే. తులసీకాష్ఠముతోఁ జేయఁబడిన మాలను గ్రహించువాఁడు అడుగడుగునకు అశ్వమేధఫలమును బొందును. నిశ్చయము.

నారాయణ ఉవాచ—

బృందాం బృందావనీం విశ్వ పూజితాం విశ్వపావనీమ్ ।
పుష్పసారాం నందినీం చ తులసీం కృష్ణజీవనీమ్॥

ఏతన్నామాష్టకం చైతత్ స్తోత్రం నామార్థసంయుతమ్।
యః పఠేత్ తాం చ సంపూజ్య సోఽశ్వమేధఫలం లభేత్॥

బృంద, బృందారాణి, విశ్వపూజిత, విశ్వపావని, పుష్పసార, నందిని, తులసి, కృష్ణజీవని – నామార్థములతోఁ గూడిన యీ నామాష్టకస్తోత్రము నెవఁడు పఠించునో వాఁడు సంపూజ్యుఁడు. వాఁడు అశ్వమేధఫలమును బడయును.

తులసి యొకప్పుడు గణేశుని ప్రార్థనచేయ, నతఁడు నిరాకరించెను. అంత నాయమ 'నీకు వివాహమగునా?' యనెను. విఘ్నేశ్వరుని పెండ్లికి అన్ని విఘ్నములే యుండు గదా! అందుమీఁద గణేశుఁడు తులసిని 'నీవు భూమిలో నసురుని గ్రహింపఁబడగలవు. వృక్షమ వయ్యెద' వని శాప మిచ్చెనని కలదు.

— గణేశఖండము.

గణేశ ఉవాచ:—

పుష్పాణాం సారభూతా త్వం భవిష్యసి మనోరమే।
కలాంశేన మహాభాగే స్వయం నారాయణప్రియా

ప్రియా త్వం సర్వదేవానాం కృష్ణస్య చ విశేషతః।
పూజా విముక్తిదా నృణాం మమ త్యాజ్యా చ సర్వదా.

గణేశుడు పలుకుచుండెను:—

ఓ మనోరమా! నీవు పుష్పము లన్నిటిలో సారభూతవు. కలాంశమున నారాయణ ప్రియ వయ్యెదవు. సమస్త దేవగణములకు, విశేషించి శ్రీకృష్ణభగవానునికి నీవలన నయ్యెడి పూజ విముక్తిదాయిని యగును. నీవు నాకు మాత్రము సర్వదా పనికిరావు.

— గణేశఖండము.

పద్మ పురాణము నందలి పాతాళ ఖండమున తులసీ మహిమ యిట్లు చెప్పఁబడి యున్నది వినుఁ.

వతుదు. ఎవఁడు విష్ణూచ్ఛిష్ట (నిర్మాల్యము) మాల తులసి మాల కంఠమున వహించునో వాఁడు దేవతలకు వంద్యుఁడు. ఎవఁడు తులసీమాలను కంఠమున ధరించి నారాయణుని బూజించునో ఆ వ్యక్తి ప్రతి పుష్పమునకుఁ బదివేల గోదానములను జేసిన ఫలమును బొందును. ఎవఁడు పాపమతియై నానాకారణములు చూపుచుఁ దులసిమాలను ధరింపఁడో వాఁడు హరికోపానలదగ్ధుఁడయి నరకమునఁ గూలును. వానికి ప్రత్యావృత్తి లేదు. అనఁగా నిష్కృతి లేదని భావము. మహాపాతకనాశిని, సకలధర్మార్థదాయిని యగు తులసిమాల, ధాత్రిమాలలను త్యాగము చేయరాదు. ధాత్రీమాల కలియుగమున నే మానవుని ఎన్ని లోమముల స్పర్శించునో అన్ని వేల సంవత్సరములు వాఁడు కేశవాలయమున వాసము చేయును. తులసీకట్టెతోఁ జేయఁబడి, కేశవునకుని వేదించిన మాల నెవఁడు భక్తితో ధరించునో వానికి పాపము లేదు. యమదూతలు తులసీ కాష్ఠమాలను జూచి గాలి కెగిరిపోవు కాఁ ఆకులవలెఁ గాలికి బుద్ధి చెప్పెదరు. తులసివనములో, ఉసిరిక చెట్టు నీడలో నెవఁడు పితరుల నుద్దేశించి పిండము పెట్టునో వాని పితృదేవతలు ముక్తి నొందెదరు. హస్తములందు, మస్తకమున, కంఠమున, కర్ణయుగళమున, ముఖమున నెవఁడు ధాత్రీమాలను ధరించునో, వాఁడు స్వయముగ హరి యని తెలియఁదగును. ఎవఁడు ధాత్రీపత్రములతోఁగాని, ఫలముతోఁగాని హరిని బూజించునో వాఁడు కోటిజన్మములనుండి యార్జించిన పాపము లొక్క పూజతో నశించును. ఓ ద్విజుడా! యజ్ఞములు, దేవతలు, మునిగణములు, సకలతీర్థములు, కార్తికమాసమున ధాత్రీపత్రము నాశ్రయించి యుండును. కార్తిక మాసమున

ధాత్రీపత్రములను ద్వాదశీ తిథియందు తులసిని చయనము (కోయుట) చేయువాఁడు యాతనామయమగు నరకమునకుఁ బోవును. కార్తికమాసమున నుసిరిక చెట్టు నీడలో నన్నమును తినువాఁడు అన్నసంసర్గము వలన గలిగిన యొక సంవత్సర దోషమునుండి విముక్తుఁ డగును.

కార్తికమాసమున తులసీ కాననము నడుమ, ఉసిరిక చెట్టు మొదటియందు హరినిఁ బూజించువాఁడు వైకుంఠమునకు బోవును. ఓ ద్విజోత్తమా! తులసీమూలదేశమున నున్న జలము నెవఁడు మస్తకమున ధరించునో వాఁడు, పాపియైనను హరినిలయమున కేగును. తులసీపత్రములనుండి జారిన జలము నెవఁడు మస్తకమున ధరించునో వాఁడు సర్వతీర్థములందును స్నానము చేసినవాఁడే, అంతమున వాఁడు విష్ణులోకమున కేగును.

పూర్వకాలమున ద్వాపరయుగములో నాదిత్యునితో సమానమైన తేజస్సుగల మార్తాండుఁడను పేరుగల నొక బ్రాహ్మణుఁడు స్నానముచేసి తులసిచెట్టులో నీళ్ళుపోసి యింటికిఁ బోయెను. ఆసమయమున నొకకుక్క దప్పికగొని యాతులసి చెట్టుపాదులో నున్న నీరు త్రాగి పిపాసము [illegible]. ఆసమయమున అసిమర్దనుఁడను పేరు గల నొక కిరాతుఁ డా కుక్కనుజూచి 'నాయింటిలో కూడుతినిపోయిన దేగాక, [illegible] లన్ని పగులఁగొట్టి వచ్చితివా! పాపీ! యిదే నీకు శాస్తి' యని దానిని బాణముతోఁగొట్టెను. శమనుని యాజ్ఞచే [illegible] భటులు పాశముద్గరపాణులయి వచ్చి, ఆ కుక్కజీవిని పాశములతో బంధించి దానిని గొనిపోవనుండఁగా, నప్పుడే [illegible] విష్ణుదూతలు వచ్చి, పాశములను ఛేదించి, వాని [illegible]

మీఁదఁ గూర్చుండబెట్టుకొని పోఁజొచ్చిరి. ఆ సమయమున యమభటులు విస్మయముతో 'సాధువులారా! ఇది ఏపుణ్యము చేసినవాని దీనిని తీసికొనిపోవుచున్నా'రని ప్రశ్నించిరి. విష్ణు దూతలు 'ఇతఁడు పూర్వ మొక రాజు. అనేక పుణ్యములు చేసినాఁడు. కాని సుందరియగు నంగనను హరించి పాపము చేసి నరకమునకుఁ బోయెను. ఇతఁడు మీప్రభువగు యముని యాజ్ఞవలన ననేక క్లేశములకు లోనయ్యెను. ఈ రాజు తన చేసిన కర్మఫలముగా నెఱ్ఱగాఁ గాలిన నినుప సెజ్జయందు బరుండబెట్టి యెఱ్ఱగాఁ గాలిన తామ్రమయస్త్రీని గాఁగిలిం చుకొనఁ జేయ నతిదుఃఖము ననుభవించెను. శమనుని ఆజ్ఞాను సారము తప్తలోహ స్తంభము నాలింగనము చేసికొనఁ జేసిరి. దానివలన నత్యంత దుఃఖము పాలాయెను. యమలోకమున మఱికొందఱు దూతలీ నరపతిని ఘోరోదకములతోఁ దడిపిరి. ఈవిధముగా బహుకాలము దుఃఖము లనుభవించెను. తరువాత నరకశేషమునఁ బాపయోనులందు మాటిమాటికి జన్మము లెత్తియెత్తి స్వకర్మవశమున ననేక క్లేశముల చిరకాల మనుభ వించి తుదకీజన్మయందు యీక్షణమున తులసీమూలమునందలి జలము పానముచేసి వైకుంఠమునకుఁ బోవుచున్నాఁడు.' యను కింకరు లీకథనువిని తాము వచ్చినవారువచ్చినట్లే తమలోకము నకుఁ బోయిరి. విష్ణుదూత లతని దీసికొని వైకుంఠమునకుఁ బోయినారు. నేను పాపనాశనకరమగు తులసీమాహాత్మ్యమును జెప్పితిని. మునిశ్వరా! విలాసముగాఁ జేసిన తులసీసేవయొక్క యీయనుత్తమ మాహాత్మ్యము శాస్త్రములందు విశేషముగాఁ జెప్పఁబడియున్నది. వీరు పొందు ఉత్తమగతులు తెలియుట కష్టము. ఇంక భక్తితో తులసిని సేవించువారు పొందు

గతులను గురించి చెప్పనేల? బహుశాస్త్రములందుఁ దులసీ మాహాత్మ్యము వర్ణింపఁబడియున్నది. వత్సా! నీవు అతిరంజన దోష దుష్టమనసు కలవాఁడవు కావుగదా?

శిష్యుఁడు:- లేదు దేవా! త్రికాలజ్ఞులగు మునులీ ప్రభావమును విశేషముగా నవగతము చేసికొని లోకహితమునకై తమ తమ గ్రంథములందపూర్వ మహిమను లిపిబద్ధము గావించిరి. ఒకరుకారిద్దఱుకారే - నూర్లకొలఁది మునులు చెప్పినారే! సర్వోత్తమమగు పావనీశక్తి లేదేని శతముఖముల గుణకీర్తనము ఏల చేయుదురు? మన శాస్త్రవాణియందు సంశయమేమియు లేదు. తాము సెలవిండు.



## దశమ ప్రకాశము

గురు:— స్కాంద పురాణమందలి విష్ణుఖండమునఁ దులసీ మాహాత్మ్య మేవిధమునఁ జెప్పఁబడియున్నదో వినుము.

బ్రహ్మోవాచ:—

> శ్రీమత్తులసీ మాహాత్మ్యం యథావద్వక్తుమర్హసి ప్రభో!
> యస్యాః సన్నిధిమాత్రేణ ప్రీతిర్భవతి తే హరే

ప్రభో! యెద్దాని సన్నిధాన మాత్రాన నీకు ప్రీతి కలుగునో యా తులసి మహిమను వర్ణింపుము.

శ్రీ భగవానువాచ:—

> మణికాంచన పుష్పాణి తథా ముక్తామయాని చ ।
> తులసీపత్ర దానస్య కలాం నార్హంతి షోడశీమ్

ముత్తెములతో, మణులతో, బంగారుపూలతోఁ జేయు పూజ తులసీ దళముయొక్క షోడశాంశమునకు సరిరావు.

ఏ వ్యక్తి తులసీ మంజరులతో నాపూజ చేయునో, ఆ మానవుఁడు గర్భగృహమున మరలఁ బ్రవేశింపఁడు. ముక్తిభాగియగును. ఓ వత్సా! ఎవఁడు తులసివేసి పెంచి, తులసీదళములతో నన్నుఁ బూజచేయునో వాఁడు స్వర్గమున నానందముతో నుండును. అట్లే శ్వేతద్వీపమున నా గృహమున వాసము చేయును.

> శ్రీమత్తులస్యార్చయతే సకృద్ధి మాం
> పత్రైః సుగంధై ర్విమలై రఖండితైః।
> యస్తస్య పాపం పటసంస్థితం తదా
> నిరీక్ష్యయిత్వా పరిమార్జయే ద్యమః॥

ఏ మానవుఁడు సుగంధము, విమలము, అఖండితము నైన తులసీపత్రములతో నొకసారి నన్నర్చించునో వాఁడు చేసిన పాపమును యముఁడు ప్రణిధానపూర్వకముగా నిరీక్షణము నొనరించిన, వ్రాయఁబడిన వివరణి (పట్టీ) లో నుండి తుడిచి వేయును. ఎవఁ డేకాదశినాఁడు నా పూజకొఱకు తులసిని సంగ్రహింపఁడో ఛీ! ఛీ! వాని యౌవనము, జీవనము, ధనము, సంపద సర్వము యేల? కాల్పనా? వాని కిహపర లోకములం దేకాలమునను సుఖము లేదు.

సమ్యక్పూజిత శివలింగమును దర్శించి, మార్గశీర్ష మాసమునఁ దులసీ పత్రములతో నన్నుఁ బూజించినచో బ్రహ్మహత్యా పాపమునుండి విముక్తుఁడగును. ఏ మానవుఁడు ప్రతి నిత్యము రమావిశిష్టుఁడ నగు నన్నుఁ దులసీదళములతోఁ బూజించునో, వాని మహాపాతకరాసులు వినాశముగాంచును. ఉపపాతకములను గుఱించి మఱి చెప్పనేల? పర్యుషిత పుష్పములు – పర్యుషితజలము (అనఁగా నిన్నఁ దెచ్చి యుంచి

నవి - పాచివి) వర్జనీయములు. పర్యుషిత గంగాజలము, పర్యుషిత తులసీపత్రములు త్యాజ్యములు కావు. ఓ పుత్రా! నాకు వల్లభయు, పవిత్రయునగు తులసి యే క్షణమువరకు నుండదో యా క్షణము వఱకే మాలతి మున్నగు పుష్పములు గర్వముతో తమ ప్రాధాన్యమును దెలియుటకయి గర్జనము చేయుచుండును. ఏ మానవుఁడు భక్తితో బిల్వపత్రములచేత నొకసారి నన్నుఁ బూజచేయునో ఆ నరుఁడు ముక్తిభాగియగును. వాఁడు నాపార్షదుఁడగును. సంశయములేదు. బిల్వపత్రములు, శమీపత్రములు, జాజిపత్రములు, పద్మములు నివియన్నియు నున్నను తులసి నాకుఁ బ్రియము. ఎట్టుల నందువా - కౌస్తుభము కంటెను నాకది ప్రియమయినది. మంజరీ యుక్తయు, హృద్యయు, నభిన్నయు నగు తులసి పాలకడలి కూఁతురగు లక్ష్మివలె నాకుఁ బ్రియమయినది. శుక్లపక్ష ద్వాదశిగాని కృష్ణపక్ష ద్వాదశిగాని నా కెంతటి ప్రియమైన తిథియో - కృష్ణతులసి యగుఁగాక, లక్ష్మీతులసి (తెలుపుది) యగుఁగాక యీ యుభయము నాకంత ప్రియమయినవే. తులసీపత్రములను గ్రహించి, భక్తితో నేవ్యక్తి నన్నుఁబూజించునో ఆపూజ ప్రభావమున సమస్తదేవతలయు, నసురగణములయు పూజచేసినవాఁడే యగును. ఎంతకాలము కృష్ణతులసి, కృష్ణమంజరుల ప్రాప్తి ఘటిల్లదో, అంతకాలము కౌస్తుభాద్యనంతరత్నములు తమ ప్రాధాన్యమును దెలుప గర్వ గర్జనము చేయుచుండును. ఏమనుష్యుఁడు భక్తితోఁ గృష్ణతులసిగొని కృష్ణుని బూజచేయునో. అచట కూడ రమా సహితుఁడయి వాసము చేయుచుండును. ఆ నరుఁడు కూడ శుభభవనమున (వైకుంఠమున) కేగును. నా పూజకొఱకు

నా భక్తులుగాని, యితరులుగాని - అన్యులకు నెవరు తులసి నిచ్చెదరో వారి కవ్యయపదము లభించును.

> తులసీ కృష్ణగౌరాయా తయాయో మాం సమర్చయేత్।
> నరోయాతి తనుంత్యక్త్వా వైష్ణవీం శాశ్వతం గతిమ్॥

ఎవఁడు కృష్ణతులసి(నల్లనిది) గాని, గౌరతులసి(తెల్లనిది) గాని వీనితో నన్నుఁ బూజించునో వాఁడీదేహమును విడిచి. శాశ్వతమగు విష్ణుపదమును గాంచును. శాస్త్ర మనంతము. నా జ్ఞాన మత్యల్పము. కొన్ని గ్రంథములందు గల తులసీవర్ణనము మాత్రమే విశేషముగ నీకుఁ జెప్పితిని. సామాన్యముగా శ్రీ శ్రీభగవానుని రూపగుణ ప్రసంగమునఁ దులసిని గుఱించి ప్రతి పురాణమునందును నున్నది. సమస్త పురాణములు, సంహితలు చూడఁగల యోగ్యతను నేను నోచుకొనలేదు. అయినను యెన్ని గుణములు తులసికున్నవో తెలియదు. ఏకొంచెమో నీకుఁ జెప్పినాను.

శిష్యుఁడు:- దేవా! తాము శ్రీమతి తులసీ సంబంధమున నేమి జెప్పితిరో దానిచేతనే నేను కృతార్థుఁడనైతిని. నాజన్మ సఫలమాయినది. దీనిని వినుటవలన నావంటి క్షీణపుణ్యులగు వ్యక్తులకెంతో యుపకారము గలిగినది. శ్రీమతి తులసిని సేవించి యనాయాసముగా శ్రీహరిభక్తి లాభమును భక్తుఁడు బడయ సమర్థుఁడగును. శ్రీతులసిని సేవించుట, భగవన్నామము చేయుట వ్యర్థము కాదు. అచిర కాలమున భావభక్తి గలిగి కృతకృత్యుఁడు కాఁగలఁడు. ఈ సంబంధమున నేమియు సంశయము లేదు.

గురు:- ఇఁకమీఁద శ్రీతులసీదేవి నామములను విను. సుభగ, తీవ్ర, పావని, విష్ణువల్లభ, సురేజ్య, సురస, కాయస్థ, సుర

దుందుభి, సురభి, బహుపత్రి, హరిప్రియ, అపేత, రాక్షసి,
శ్యామ, గౌరి, త్రిదశమంజరి, భూతఘ్ని, భూతపత్రి.
— రాజనిఘంటువు.

పర్ణాస, బృంద, కఠిజ్జర, కుఠేరక. — శబ్దరత్నాకర.

వైష్ణవి, పుణ్యా, పవిత్ర, మాధవి, అమృత పత్రపుష్ప,
సుగంధ, గంధహారిణి. — [illegible]

మధుమిత్ర, సురవల్లి, ప్రేత, రాక్షసి, సుభిక్ష, [illegible]
సులభ, బహుమంజరి, దేవదుందుభి. — [illegible]

క్షుద్రపత్ర తులసి పర్యాయము:- ఖరపత్ర, జంబీర, [illegible]
ఫనిర్ఝుజక, అల్పపత్ర, సమీరణ. — [illegible]

గంధతులసి పర్యాయము:- సుగంధక, [illegible]
ఫనిర్ఝుక, గంధఫనిర్జ, సుగంధ, దేవదుందుభి [illegible]
రక్తతులసి పర్యాయము. — [illegible]

విషగంధ తులసి పర్యాయము:- వైకుంఠక, [illegible]
మానక.

శ్వేతతులసి పర్యాయము:- అర్జక, శ్వేతపర్ణాస, [illegible]
కుఠేరక, అప్రార్జక, తీక్ష్ణ, తీక్ష్ణగంధ, [illegible]

కృష్ణతులసి పర్యాయము:- కృష్ణార్జక, కృష్ణ [illegible]
కరాళక, కాలపర్ణి, సురభి, మానకి, [illegible]

బర్బరీతులసి పర్యాయము:- సురభి, [illegible]
అపేత, రాక్షసి. [illegible]

బర్బరి, కబరి, తుంగి, ఖరపుష్ప, [illegible]

ఈవిధముగా దేవియొక్క పలునామములు [illegible]

శ్రీమద్భాగవతాది మహాపురాణ గ్రంథములందు విశేష ముగా తులసీమాహాత్మ్య ముల్లేఖింపఁబడి యుండలేదు. ఐనను నేతావున హరి రూప గుణ వర్ణనము వచ్చెనో, యాస్థానము లందు బృంద కలదు. శ్రీ మద్భాగవతమందలి వైకుంఠ వర్ణనము వినుము.

మందార కుంద కురవోత్పల చంపకార్ణ
పున్నాగ నాగ వకులాంబుజ పారిజాతాః।
గన్ధోఽర్చితే తులసికాభరణేన తస్యా
యస్మిన్ తపః సుమనసో బహుమానయంతి॥ (౧-౩-౧౬)

దేవతలు మందారము, కుందము(మొల్ల), తిలకవృక్షము, ఉత్పలము (నల్లగలువ), చంపకము, పున్నాగము, నాగ కేస రము, వకుళము (పొగడ), పద్మము, పారిజాతము మున్నగు పుష్పముల పరిమిళమున్నను, తులసికాభరణుఁడగు శ్రీహరి తులసీగంధముచే నర్చితుఁడయ్యె నేని – యీ తులసి తపస్సు యేమి? అని విశేషముగా సుమనస్సులు కీర్తించుచున్నారు.

శ్రీహరియు శ్రీతులసి నిత్యసంబంధ విశిష్టులు ఒకరిని స్మరించిన రెండవవారినికూడ స్మరించినట్టులే. కమల శ్రీహరితో నప్పుడప్పుడు విడిచియుండుట కలదుగాని శ్రీమతి తులసీదేవి శ్రీనాథునితోఁ జిరసంశ్లిష్ట.

వత్సా! నీ వచిర కాలముననే శ్రీహరియొక్క భక్తిని బొందెదవుగాక! నీయొక్క పట్టుదలచేతనే నేఁడు శ్రీమతి బృందాదేవి మహిమ కీర్తించు శుభమగు సుయోగము లభిం చినది. బృందాదేవి కీర్తనముచే నేను ధన్యుఁడ నయితిని. నీవు ధన్యుడవైతివి. ఏవ్యక్తి యీబృందాదేవి మాహాత్మ్య మును శ్రద్ధావంతుఁడయి వినునో యతఁడు ధన్యుఁడు కాఁగ

లంపు. అవిశ్వాసి, నాస్తికుఁడు, శఠుఁడు, లోకవంచకుఁడు నగువానికి యీ శుభమగు మాహాత్మ్యమును వినిపింపకుము. ఆస్తికుఁడు భగవద్భక్తుఁడు నగువాఁడే దీనిని వినుట కధికారి. దీనిని వినుటవలన భగవద్భక్తి దినదినవర్ధమాన మగును. రోగ శోకములు, పాపతాపములు దూరముగాఁ దొలఁగి పోవును.

భవాబ్ధి పోతం భరతాగ్రజం తం
భక్తప్రియం, భానుకుల ప్రదీపమ్ ।
భూతాధినాథం భువనాధిపంతం
భజామి రామం భవరోగ వైద్యమ్॥



# ఏకాదశ ప్రకాశము

శిష్యుఁడు:- దేవా! తులసిమహిమ మఱియును వినవలెనని యున్నది.

గురు:- ఆనందమయినది. నీవు తులసీ వివాహ ప్రకరణమును వినుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

వివాహం సంప్రవక్ష్యామి తులస్యాస్య యథావిధిః।
యథోక్తం పంచరాత్రే వై బ్రహ్మణా భాషితం పురా॥
ఆదావేవ వనేవాప్య తులసీం స్వగృహేఽపి వా।
వర్షత్రయేణ పూర్ణేన తతో యజన మారభేత్॥
సౌమ్యాయనే ప్రకర్తవ్యం గురుశుక్రోదయే శుభే।
అథవా కార్తికే మాసి భీష్మపంచదినేషు చ॥
వైవాహికేషు ఋక్షేషు పూర్ణిమాయాం విశేషతః।
మండపం కారయేత్తత్ర మండవేదిం తథాపునః॥

— హరిభక్తివిలాస ధృతి విష్ణుయామళము.

పూర్వము బ్రహ్మ పాంచరాత్రమున దేనిని చెప్పియుండెనో యాతులసియొక్క యథావిధి వివాహమును జెప్పుచున్నాను. ప్రథమమున వనములోఁగాని, తన గృహమునందుఁగాని తులసిని వేసి, మూడేండ్లు నిండినతర్వాత యజన మారంభింప వలెను. గురుశుక్రోదయమయిన సౌమ్యాయనమునగానీ లేదా కార్తీకమాసమున భీష్మపంచకమున వివాహ నక్షత్రమున విశేషించి పూర్ణిమనాఁడు మండపము కుండవేది యేర్పాటు చేయవలెను.

శాంతికంచ ప్రకర్తవ్యం మాతౄణాం స్థాపనం తథా।
మాతృశ్రాద్ధాదికం సర్వం వివాహం చ సమాచరేత్॥
బ్రాహ్మణాంశ్చ శుచిస్నాతాన్ వేదవేదాంగపారగాన్।
బ్రహ్మాచ దేశికశ్చైవ చత్వారశ్చ తథర్త్విజాః॥

శాంతిని మాతృగణమును స్థాపింపవలెను. వివాహముంగో వలెనె మాతృశ్రాద్ధాదికము చేయవలెను. శుచిస్నాతులు, వేదవేదాంగపారగులు నగు బ్రాహ్మణులను, బ్రహ్మ, ఆచార్యుఁడు, నలుగురు ఋత్విజులను వరించవలెను.

వైష్ణవేన విధానేన వరణీకలశం యజేత్।
మండపంకారయేత్తత్ర లక్ష్మీనారాయణం శుభమ్॥

గ్రహయజ్ఞం పురః కృత్వా మాతౄణాం యజనాం తథా।
కృత్వా నాందీముఖం శ్రాద్ధం సౌవర్ణం స్థాపయేద్ధరిమ్॥
కృత్వారోపం చ తులసీం లగ్నే త్వస్తమితే గవా।
వాసః శతేన మంత్రేణ వస్త్రయుగ్మేన వేష్టయేత్॥

యదా బధ్నాతి మంత్రేణ కంకణం పాణిపల్లవే।
రోహాదితి చ మంత్రేణ పాణిగ్రాహో విధీయతే॥

తతః కుండే సమాగత్య ఆచార్యః సహసాద్విజైః।
ఆచార్యోక్త వేదికా కుండే ముహుయాచ్చ నహాహుతీః॥

వివాహకర్మవత్ సర్వం వైష్ణవం దేశికోత్తమైః।
కర్తవ్యశ్చ తతో హోమ విశేషా ద్విధి పూర్వకమ్॥

వైష్ణవ విధానము ననుసరించి వర్ధనీకలశము నర్చన చేయవలెను. లక్ష్మీనారాయణ శుభమండప మాస్థానమునఁ జేయింపవలెను. ప్రథమమున గ్రహయజ్ఞ (పూజ) మొనరించి మాతృకా గణపూజ నాందీముఖశ్రాద్ధము గావించి, సువర్ణ మయు హరి విగ్రహమునందు స్థాపింపవలెను. సూర్యు డస్తమించిన పిమ్మట సులగ్నమున తులసి నారోపణ మొనరించి, 'వాసః శతేన' యను మంత్రముతో వస్త్రయుగ్మమును జుట్టవలెను. "యదాబధ్నేతి" మంత్రముతో పాణిపల్లవమునఁ గంకణము కట్టవలెను. "కోదాదితి" మంత్రముచేతఁ బాణి గ్రహణము చేయింపవలెను. తదనంతరము ఆచార్యుఁడు బ్రాహ్మణులతో కుండము దగ్గఱకుఁబోయి, వేదికాకుండమున తొమ్మిది ఆహుతులు వేయవలెను. వైష్ణవ వివాహకర్మము వలె సమస్తకర్మము లుత్తమ గురు వనుష్ఠింపవలెను. దాని పిమ్మట విధిపూర్వకముగ విశేషహోమము చేయవలెను.

ఓం నమో భగవతే కేశవాయ నమః స్వాహా
" నారాయణాయ స్వాహా
" మాధవాయ స్వాహా
" గోవిందాయ స్వాహా
" విష్ణవే స్వాహా
" మధుసూదనాయ స్వాహా
" త్రివిక్రమాయ స్వాహా
" వామనాయ స్వాహా
" శ్రీధరాయ స్వాహా
" హృషీకేశాయ స్వాహా
" పద్మనాభాయ స్వాహా

,, దామోదరాయ స్వాహా
,, ఉపేంద్రాయ స్వాహా
,, అనిరుద్ధాయ స్వాహా
,, అచ్యుతాయ స్వాహా
,, అనంతాయ స్వాహా
,, గదినే స్వాహా
,, చక్రిణే స్వాహా
,, విష్వక్సేనాయ స్వాహా
,, వైకుంఠాయ స్వాహా
,, జనార్దనాయ స్వాహా
,, ముకుందాయ స్వాహా
,, అధోక్షజాయ స్వాహా

ఏనిని ప్రత్యేకమాహుతియిచ్చి, హోమ శేషముగావింపవలెను.

యజమానః సపత్నీకో హ్యస్య యే గోత్రబాంధవాః ।
ప్రదక్షిణాశ్చ కర్తవ్యా శ్చత్వారో విష్ణునాసహ ॥
తులస్యా పాణిగ్రహణే వేదికాయాం విభావసోః ।
శతకుంభం జపేత్ సూక్తం పావమానీం విశేషతః ॥

తథైవ శాంతికాధ్యాయం నవసూక్తం తథైవ చ ।
జీవసూక్తం పునస్సర్వా తథా వైష్ణవ సంహితామ్ ॥
శంఖ దుందుభినిర్ఘోషై ర్భేరీ తూర్యస్య నిస్వనైః ।
గాయంతే మంగళా నార్యా మాంగల్యం విధి మాచరేత్ ॥

దాపయేత్ పూర్ణాహుతిం పశ్చా దభిషేక విధిం తతః ।
బ్రాహ్మణే వృషభం దద్యా దాచార్యం పరిధాప్యచ ॥
గాం పటం చ తథా శయ్యా మాచార్యాయ ప్రదాపయేత్ ।
ఋత్విగ్భ్యో దాపయే ద్వస్త్రా ణ్యేషాం దద్యాచ్చ దక్షిణామ్ ॥

పత్నీ యుతుఁడయి సగోత్రులతోఁ జుట్టపక్కాలతో విష్ణువుతో సహా నాలుగు ప్రదక్షిణములు చేయవలయును. తులసీ పాణిగ్రహణమున శతకుంభసూక్తమును, విశేషించి

పావమానీసూక్తమును, శాంతి కాధ్యాయమును, జీవసూక్తమును కారణాంతరమున వైష్ణవసంహితను అగ్నికుండవేదిక యందు జపింపవలెను. శంఖము, ఝల్లరి, భేరీ, తూర్యధ్వనులు చేయవలెను. నారీగణము మంగళములు పాడు మాంగల్య విధి నాచరింపవలెను. పూర్ణాహుతియైన పిమ్మట నభిషేకము చేయవలెను. బ్రాహ్మణునకు వృషభదానము చేయవలెను. వస్త్రపరివేష్టితముగు గోవును ఆచార్యున కీయవలెను. ఋత్విక్కులకు వస్త్రము లిచ్చి దక్షిణ లొసఁగవలెను.

ఏవం ప్రతిష్ఠితాం దేవీం విష్ణునా చ సమర్చయేత్ ।
ఆజన్మార్జితం పాపం దర్శనేన ప్రణశ్యతి॥
రోపయేత్ తులసీం యస్తు సేచయేచ్చ ప్రయత్నతః ।
ప్రతిష్ఠాప్య యథోక్తేన విష్ణునా సహ మానవః ।
స మోక్షం లభతే జంతు ర్విష్ణులోకం తథాక్షయమ్॥
ప్రాప్నోతి విపులాన్ భోగాన్, విష్ణునా సహమోదతే।
ప్రతిష్ఠా శ్రీ తులస్యాస్తు లిఖితా విష్ణుయామళే॥

— హరిభక్తివిలాసము ౨౦

ఈ విధముగాఁ ప్రతిష్ఠచేసి, విష్ణుసహితముగా దేవిని లెస్సగా నర్చింపవలెను. ఆ జన్మము నార్జించిన పాపము దర్శనముచేతనే నశించును. ఏమానవుఁడు తులసినినాటి, ప్రయత్నపూర్వకముగా నీరుపోయుచు, యథావిధిగా విష్ణుసహితముగా ప్రతిష్ఠ చేయునో, వాఁడు మోక్షమును బొందును. అక్షయ సుఖము విష్ణువుతో ననుభవించును. విష్ణుయామళమందు తులసీ ప్రతిష్ఠావిధి యీ విధముగాఁ జెప్పఁబడినది.

శిష్యుఁడు:- దేవ! యీ విధమయిన తులసీవివాహ మీ దేశమునఁ గానరాదే? తులసి సన్నిధిలో ననేకులు చేయుచుందురు. ఇప్పు డది యెగిరిపోయి యుండును.

గురు:- మనుష్యుఁడు నాగరకత బలసినకొలది శాస్త్రీయాచార వ్యవహారములను దురభ్యాసములని వదలుచున్నాఁడు. అందువలననే దుఃఖము వృద్ధియగుచున్నది.

శిష్యు:- హరిభక్తివిలాసమునఁ దులసిని గుఱించి, మఱేమి చెప్పియున్నదో చెప్పుఁడు.

గురు:- గయా శ్రాద్ధ ఫలం దాతుః పితౄణాం పరితోషదమ్।
తత్ఫలం స్యాచ్ఛతగుణం తులసీపత్ర దానతః॥

— శ్రీ బృహద్బ్రహ్మపురాణము ౫౦ అ.

గయలో శ్రాద్ధముచేసినయెడల పితృగణములు సంతోషించును. తులసీదళమునొసఁగిన, దానికి నూఱుమడుఁగు లధికఫలము కలుగును.

తులసీ మంజరీభి ర్యః కుర్యా ద్ధరిహరార్చనమ్।
న స గర్భగృహం యాతి ముక్తిభాగీ భవేన్నరః॥

తులసిమంజరులతో మానవుఁడు హరిహరుల నర్చించి నచో మరలగర్భగృహమునఁబ్రవేశింపఁడు. ముక్తినందును.

శిష్యు:- అయినచో తులసీపత్రములు, తులసీ మంజరులు, శివునకుఁ బ్రీతిపదములా ?

గురు:- నిశ్చయముగా. మఱియు వినుము.

వాజిదంతకపత్రైశ్చ పుష్పైశ్చాపి చండికామ్।
తులసీ కుసుమైః పత్రై రర్చయే చ్ఛ్రీవివర్ధయే॥

— కాలికాపురాణము. ౬౮ అ.

వాసక పత్రపుష్పములతోను, తులసీ పత్రపుష్పముల తోను శ్రీవృద్ధిని కోరువారు చండికనుఁ బూజింపఁగలరు.

శిష్యు:- వాసకపత్రములతో చండికను బూజింతురా ? మహా మాయయు తులసి పత్ర పుష్పములకు సంతోషించునా ?

గురు:- నాయనా! హరి, హరుడు, ఉమా, లక్ష్మి యిందఱు యొకటే. వీరిలో భేదము లేదు నాయనా! స్నానము చేసియే తులసి చయనము (సంగ్రహము) చేయవలెను.

అస్నాత్వా తులసీం ఛిత్వా యః పూజాం కురుతే నరః।
సోఽపరాధీ భవేత్ సత్యం తత్సర్వం నిష్ఫలం భవేత్॥

స్నానము చేయక తులసినిగ్రహించి పూజచేయువాఁడు అపరాధి. వాఁడు చేసినదంతయు నిష్ఫలము.

శిష్యుఁడు:- శరీరమునం దస్వస్థతగానుండి స్నానము చేయలేనప్పు డేమిచేయవలెను?

గురు:- ఆగ్నేయము, వారుణము, బ్రాహ్మము, వాయవ్యము. మతాంతరమున —

మాంత్రం పార్థివ మాగ్నేయం వాయవ్యం దివ్యమేవ చ।
వారుణం మానసం చేతి స్నానం సప్తవిధం స్మృతమ్॥

మాంత్రము, పార్థివము, ఆగ్నేయము, వాయవ్యము, దివ్యము, వారుణము, మానసమని స్నానమేడువిధములు.

ఆగ్నేయం భస్మనా స్నానం, మవగాహ్యంతు వారుణమ్।
ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మం వాయవ్యం గోరజః స్మృతమ్॥

భస్మము పూసికొనుట ఆగ్నేయము, నీటిలో మునుఁగుట వారుణము, ఆపోహిష్ఠాది మంత్రములచే చేయునది మంత్రస్నానము (బ్రాహ్మము), గోరజముచేతఁ చేయఁబడినది వాయవ్యము.

శన్న ఆపంతు వై మాంత్రం, మృదాలిపంతు పార్థివమ్।
భస్మనా స్నాన మాగ్నేయం, స్నానం గోరజసానిలమ్॥

ఆతపే చైవ వా వృష్టి దివ్యస్నానం తదుచ్యతే।
నదీ క్షన్యాదిషు స్నానం వారుణం ప్రోచ్యతే బుధైః।
ధ్యానం యన్మనసా విష్ణో మానసం తత్ ప్రకీర్తితమ్॥

— స్కాందపురాణము.

శన్న ఆపః అను మంత్రముచే మంత్రస్నానము, మృత్తికా లేపనము పార్థివము, విభూతి లేపనము ఆగ్నేయము, గోపద ధూళిచే నైనది వాయవ్యము, వెలుపల నదుల మున్నగు వానియందైనది వారుణము, ఎండకాయుచుండ వానగురిసి నప్పు కలుగునది దివ్యము, విష్ణువును ధ్యానము చేయుట మానసస్నానము. శరీర మస్వస్థతగా నుండినపు డాగ్నేయాది స్నానములాచరించి నిత్యకర్మములగు సంధ్యావందనాదులు చేయనగును. తులసితో నెవండు సాలగ్రామములు పూజించునో వాండు చేసిన ద్వాత్రింశ దపరాధములను హరి క్షమించును. విశేషించి కలియుగమున దేవదేవుండు, జగత్స్వామి యగు హరి తులసికాననమునకంటె వేఱొక తావునం బ్రీతి వహింపండు.

శిష్యుడు:- తులసీకానన మనిన భగవంతున కంత ప్రీతియా?

గురు:- హిత్వా తీర్థసహస్రాణి సర్వానపి శిలోచ్చయాన్।
తులసీకాననే నిత్యం కలౌ తిష్ఠతి కేశవః॥

వేయికొలది తీర్థములను, సర్వపర్వతములను వదలి హరి తులసికాననమునం గలికాలమున నిత్యనివాసము చేయుచుండును. ఎవండు తులసీకాననమును దర్శించునో, ఎవండు శిరఃప్రాన్తకముగా తులసివనము వేసి పెంచునో వాండు పరమపదమును బొందును.

శిష్యుడు:- తులసీ భజన మెన్ని విధములు?

గురు:- తొమ్మిదివిధములు. దర్శనము, స్పర్శనము, ధ్యానము, కీర్తనము, ప్రణామము, తులసీనామము లేక మాహాత్మ్య శ్రవణముచేయుట, సేదనము, పుష్పాదులతోఁజేయు పూజనము - యీ నవవిధముల నెవఁడు తులసిని భజించునో వాఁడు కోటియుగ సహస్రములు హరియొక్క పరమపదమున నివాసము చేయును. యముఁడు తనదూతలను జూచి 'యెవఁడు తులసితోఁజేసిన సొమ్ముల ధరించునో, ఎవఁడు తులసినామము జపించునో, ఎవఁడు తులసిని సేవించునో వారున్న తావునకు మీరు దూరముగాఁ దొలఁగిపొండు.' అని చెప్పెను. — కాశీఖండము.

తులసికాననము సర్వపాపముల నశింపఁజేయును, సర్వకామములను సిద్ధింపఁజేయును. తులసివనము వేసినవారికి యమదర్శనము లేదు. — పద్మపురాణము.

ఏ యింటియందు తులసివనముండునో అది తీర్థము. యమదూత లా తావునకు రాఁజాలరు.

రోపణము, పాలనము, జలసించనము, దర్శనము, స్పర్శనము చేసెనేని మానవుఁడు మనోవాక్కాయములతోఁ జేసిన పాపములను తులసి నశింపఁజేయును. తులసీకాననమునకు నలుగడల నొక క్రోసుదూరముగల ప్రదేశమంతయు పవిత్రమైనది. ప్రాతఃకాలమున మేల్కని, మఱిదేనినిచూడక మొట్టమొదట తులసినిదర్శించెనేని మానవుఁడహోరాత్రము చేసిన పాపము తత్క్షణము నశించును. —అగస్త్యసంహిత

శిష్యుఁడు :— తులసీవన మాహాత్మ్యము విని ప్రాణము హాయి చెందినది. తాము వెండియు సెలవిండు.

శ్లో:- కృతం యేన మహాభాగ తులసీవనరోపణమ్ ।
ముక్తిదన భవే ద్దత్వా ప్రాణినాం వినతాసుత ॥
తులసీ కాననే యస్తు ముహూర్త మపి విశ్రమేత్ ।
జన్మకోటికృతాత్ పాపా న్ముచ్యతే నాత్ర సంశయః ॥
— గరుడపురాణమ్.

ఓ మహాభాగా! గరుడా! యెవఁడు తులసివనమును వేయునో వాఁడు ప్రాణులకు ముక్తిదాత యగును. తులసి వనములో నొక గడియసేఁపు విశ్రమించిన యెడల, కోటి జన్మములనుండి చేయుచు వచ్చిన పాపము నశించును. ఇంక సందియము లేదు.

ఎవఁడు తులసిపాదులోనుండి యెన్ని గడ్డిమొక్కలను తీసివేయునో వాని బ్రహ్మహత్యాపాపములు యన్ని నశించును.

ఏ వైష్ణవుఁడు దేవాలయమునందు తులసి వనము వేయునో వాఁడు పితృగణములతో నక్షయస్థానమున నివసించును.

తులసివన దర్శనమున పాపములు నశించిపోవును. బ్రహ్మహత్య చేసినవాని పర్యంతము పవిత్రుఁ డగును.

ఎవరి గృహమున నెండినదికాని, పచ్చిదికాని తులసి కట్టె యుండునో వారియింటఁ బాపము ప్రవేశింపజాలదు.
— గరుడపురాణము.

ఏ బ్రాహ్మణులు తులసికట్టెతో నగ్నియందుహోమము చేయునో వాడు లవలవమున నగ్నిష్టోమ యజ్ఞ ఫలమునుఁ బొందును.
— ప్రహ్లాద సహిత - విష్ణుధర్మోత్తరము.

తులసికట్టె నిప్పుతో నన్నమును వండి, శ్రీభగవానునికి నివేదించిన నది మేరుతుల్యమగును.

తులసికట్టెతో నెవని దేహము కాల్పబడునో, వాఁడెప్పుడును విష్ణులోకమునుండి మరలిరాఁడు.

తీర్థములాడకపోయినను, మరణకాలమున హరియొక్క స్మరణముగాని, కీర్తనముగాని చేయకపోయినను తులసికట్టెతో నెవని మృతశరీరము దహనము చేయఁబడునో వానికిఁ బునర్జన్మము లేదు.

శిష్యుఁడు:- ఒక మృతదేహమును దహనము చేయునంత తులసికట్టె సంభవమగునా ?

గురు:- యద్యేకం తులసీకాష్ఠం మధ్యే కాష్ఠం చ యస్య హి ।
దాహకాలే భవేన్ముక్తిః పాపకోటి యుతస్య చ॥

బండెడుకట్టెలలో నొక తులసికట్టెనుంచి దహనముఁ జేసిన, కోటిపాపములు చేసినవాడైనను మోక్షమునుఁ బొందును.

ఎవరి నాభియందు, ముఖమునందు, శిరమునందు, రెండు చెవులయందు నిత్యము తులసిపత్రము లుండునో వానికి తీర్థములతో, యజ్ఞాదులతో నేమి ప్రయోజనము ?

— స్కాందపురాణము.

ఎవఁడు కర్ణములందు సతతము తులసిపత్రముగాని, కట్టెగాని ధరించునో వాని కుపపాతకము లుండవు.

— బ్రహ్మనారదీయము.

అనాశ్రమియేగాని, మిథ్యాచారియేగాని ఏవైష్ణవుఁడు మస్తకమున తులసిని వహించునో వాఁడు సమస్త లోకములను పవిత్రము చేయును.

శిష్యుఁడు:- ఓహో! అదియా! కొందఱు సాధువుల చెవులకుఁ దులసికట్టెతోఁ జేయఁబడిన కుండలములు కానవచ్చుచుండును.

గురు:- ఎవరి ముఖమున, మస్తకమున, కర్ణములఁ దులసి పత్రము లుండునో యముఁడు వారిపాపములను లెక్కలో నుండి తుడిచివేయును.

ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాల మెవఁడు తులసి పత్రముల భుజించునో వాని శరీరము నూఱు చాంద్రాయణములు చేసినదానికంటెఁ బవిత్రమగును.

— గరుడపురాణము.

శిష్యుఁడు:- తులసిపత్రముల నమిలి తిననగునా?

గురు:- ఔను.

తథా చ తులసీ పత్ర భక్షణా ద్భాక వర్జితః ।
పాపోఽపి సద్గతిం ప్రాప్త ఇత్యేత దపి విశ్రుతమ్॥

చాంద్రాయణ సహస్రస్య పరాకాణాం శతస్య చ ।
న తుల్యం జాయతే పుణ్యం తులసీ పత్ర భక్షణాత్॥

కృత్వా పాప సహస్రాణి పూర్వే వయసి మానవః ।
తులసీ భక్షణా న్ముచ్యేత్ శ్రుత మేతం పురా హరేః॥

— స్కాందపురాణము.

భక్తి లేకయే పాపియైనను తులసిపత్రములను భక్షించె నేని వాఁడు సద్గతిచెందును. సహస్ర చాంద్రాయణములు, శతపరాక్రత్వములు చేసినను తులసిపత్ర భక్షణమువలనఁ గలిగినంత పుణ్యము కలుగదు. పడుచుఁదనములోఁ గండ పొవరున పాపములు చేసినను తర్వాత తులసీభక్షణము

చేసెనేని వాఁడు ముక్తుఁడగును. పూర్వము శ్రీహరి సన్నిధిలో నిది వింటిని. తులసి మహిమను గుఱించి నీకనేకము చెప్పినాను. అయినను కొంచెమేనియుఁ జెప్పినవాఁడనుగాను.

పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాః సరితస్తథా।
వాసుదేవాదయో దేవాః వసంతి తులసీ దళే॥ — గర్గ సంహిత.

పుష్కరాది తీర్థములు, గంగాది నదులు, వాసుదేవాది దేవతలు తులసీదళమునందు వాసము చేయుదురు.

తులసీ దళలక్షేన యోఽర్చయేత్ ద్వారకాప్రియమ్।
జన్మాయుత సహస్రాణాం పాపస్య కురుతే క్షయమ్॥
—స్కాందపురాణము.

లక్షతులసిదళములతో శ్రీ ద్వారకానాథుని నర్చించిన పదివేల సహస్రజన్మముల చేసిన పాపము నశించును.

తులసీ దళలక్షేన కార్తికే యోఽర్చయే ద్ధరిమ్।
పత్రే పత్రే మునిశ్రేష్ఠ మౌక్తికం లభతే ఫలమ్॥
— పద్మపురాణము.

కార్తికమాసమున లక్ష తులసిపత్రములతో నెవఁడు హరిని బూజించునో వాఁడు పత్ర పత్రమునకు ముక్తి ఫలము, భక్తిలాభము పడయును.

పత్రము, పుష్పము, ఫలము, జలము తులసిగంధములో వాసితమొనరించి శ్రీభగవానునకు నివేదించిన లక్షగుణములు ఫలమిచ్చును.

తులసీ కాష్ఠ మాలాం చ కంఠస్థాం వహతే తు యః।
అప్యశౌచోఽప్యనాచారో మామేవైతి న సంశయః॥
— విష్ణుధర్మోత్తరము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు:

తులసి కట్టెతోఁ జేయఁబడిన మాలను కంఠమున ధరించినవాఁడు అనాచారియైనను, అశుచియయినను నన్నుఁ బొందుచున్నాఁడు. దీనిలో సంశయము లేదు.

తులసీకాష్ఠ మాలను నెవఁడు ధరించునో శ్రీ భగవానుఁడు వానికి ప్రత్యహము శ్రీ ద్వారకలో నివసించిన ఫలము నొసఁగును. — గరుడపురాణము.

శ్రీ భగవానునకుఁ దులసికాష్ఠమాలను నివేదనమొనరించి, ధరించువానికి పాపముండదు. వారియెడ దేవకీనందనుఁడగు శ్రీకృష్ణపరమాత్మ ప్రీతి కలవాఁడగును. తులసి కట్టెతోఁ జేయఁబడిన మాలను ధరించువానికిఁ బ్రాయశ్చిత్తముతోఁ బనిలేదు. వాని దేహమున నశుచి యుండదు.

తులసీకాష్ఠ సంభూతం శిరసో యస్య భూషణమ్।
బాహ్వోః కరేచ మర్త్యస్య దేహే తస్య సదా హరిః॥

తులసీకాష్ఠమాల యెవరి మస్తకమున, బాహువుల, కరముల భూషణముగా నుండునో వారి దేహములందు శ్రీహరి సదా వాసముచేయును.

తులసి కాష్ఠమాలను ధరించి పితృకార్యములను, దేవకార్యములను జేసిరేని కోటిగుణములు ఫలమిచ్చును.

ఏ విధముగా కాకాకులు గాలి కెగిరిపోవునో, ఆ విధముగా తులసిమాలను ధరించిన మానవులను జూచి యమదూతలు దూరముగాఁ బాఱిపోయెదరు.

శయనే భోజనే చైవ మలమూత్ర విసర్జనే ।
న త్యజేత్ తులసీమాలాం త్యాగే చ బ్రహ్మహా భవేత్॥

పరుండునపుడు, భోజనకాలమున, మలమూత్ర విసర్జనమున తులసిమాలను విడువరాదు. విడిచిన బ్రహ్మహత్యా పాపము కలుగును.

స్నానే, మూత్రే పురీషే చ మైథునే పాపకర్మసు ।
న త్యజేత్ తులసీమాలాం త్యాగేచ బ్రహ్మహా భవేత్॥

— స్మృతిసరోజము.

స్నానకాలమున, మలమూత్ర త్యాగమున, మైథున సమయమున యిట్టి పాపకార్యములందు తులసిమాలను త్యజింపరాదు. త్యజించిన బ్రహ్మహత్య చేసిన పాపము కలుగును.

యజ్ఞోపవీతవ ద్ధార్యా కంఠే తులసిమాలికా ।
క్షణమాత్రే పరిత్యాగా ద్విష్ణుద్రోహీ భవే న్నరః॥
అశౌచే చాప్యనాచారే కాలేఽకాలే చ సర్వదా ।
తులసీమాలికాం ధర్త్రే స యాతి పరమంపదమ్॥

— సాధనకృతాంజలి.

యజ్ఞోపవీతమును వలె తులసి మాలను కంఠమున ధరించవలెను. క్షణమాత్రము విడిచినను విష్ణుద్రోహి యగును. అశుచిగానున్నను, అనాచారియైనను, కాలము గాని అకాలముగాని యనక సర్వదా తులసిమాలను ధరించువాఁడు పరమగతిని బొందును.

తులసిజన్మము రాస(కార్తిక)పూర్ణిమనాఁడు. ఆనాఁడు తులసిని విశేషముగా పూజించినచో వైకుంఠమును బ్రాపిం

చుచు. బ్రదికియున్నంతకాలము తులసిమహిమ చెప్పినను పూర్తిగాఁ జెప్పుటకు సాధ్యము కాదు.

శిష్యుఁడు:- దేవా! దేవరవారి శ్రీముఖమునుండి తులసి మహిమ వింటిని. కృతార్థుఁడనయితిని. నా జీవనము ధన్యమైనది. నేను నిజము తెలిసికొన్నాను. తులసిదేవిని నాశ్రయించినచో నిహపరలోకములనుగుఱించిన చింతయేదియు నుండదు. నేను శాశ్వతముగ నిర్భయుఁడ నయినాను.

జయము మాతా తులసి ! జయము మాతా తులసి !

గురు:- కేవలము నీవే కాదు ధన్యుఁడవు – నేనును ధన్యుఁడనైతిని. రా రమ్ము. శ్రీ తులసిమాతకుఁ బ్రణామము చేయుచున్నాను.

జయ్ మా తులసీ ! జయ్ మా తులసీ !! జయ్ మా తులసీ !!!





జానకిరాం ప్రెస్, తెనాలి.

# శ్రీ వాసుదాస స్వామివారి గ్రంథములు

| | | |
|---|---|---|
| బాలకాండము | ... | 12- 8-0 |
| అయోధ్యాకాండము 1, 2 భాగములు | ... | 16- 0-0 |
| అరణ్యకాండము | ... | 10- 0-0 |
| కిష్కింధకాండము | ... | 8- 0-0 |
| సుందరకాండము | ... | 10- 0-0 |
| యుద్ధకాండము 1, 2 భాగములు | ... | 16- 0-0 |
| ఉత్తరకాండము | ... | 10- 0-0 |
| ముముక్షుహితచర్య (బైండు) | ... | 2- 8-0 |
| విడిభాగములు 2 ఒక్కొక్కటి | ... | 0-14-0 |
| (ప్రథమసోపానము భక్తినిత్యచర్య) | ... | 0- 2-0 |
| ద్వితీయసోపానము | ... | 0- 4-0 |
| మేలుకొలుపు | ... | 0- 4-0 |
| హనుమదాచార్యోపదేశము | ... | 0- 4-0 |
| సీతోపదేశము | ... | 0- 4-0 |
| భగవదారాధనము | ... | 1- 0-0 |
| రహస్యరత్నాకరము (ప్రపన్నానుష్ఠానము) | | 0-12-0 |
| పై రెండు కలిపిన క్యాలికో బైండు | ... | 2- 8-0 |
| సావిత్రీచరిత్రము | ... | 0- 5-0 |
| వామనచరిత్రము | ... | 0- 5-0 |
| శకుంతలచరిత్రము | ... | 0- 5-0 |
| సుందరకాండ మూలము | ... | 3- 4-0 |
| పరమార్థతత్త్వము | ... | 2- 8-0 |
| ప్రమేయరత్నావళి | ... | 1- 4-0 |
| టెంకాయచిప్ప శతకము 2 భాగములు | ... | 1- 0-0 |
| పోతనరత్నములు క్యాలికో బైండు | ... | 1-12-0 |
| ,, శేపరుతో | ... | 1- 8-0 |
| నుతిత్రయము | ... | 0- 4-0 |

| | | |
|---|---|---|
| బాలహితచర్య | ... | 1- 0-0 |
| కుమారహితచర్య | ... | 1- 0-0 |
| కుమారీహితచర్య | ... | 0- 8-0 |
| పతి ,, | ... | 1- 0-0 |
| సతి ,, | ... | 0-12-0 |
| గర్భిణి ,, | ... | 1- 0-0 |
| హనుమంతునిచరిత్ర (1,2 భా) ప్రతి 1కి | ... | 1- 4-0 |
| సీతాదేవిచరిత్ర మూడుభాగములుకలిపి | ... | 2- 0-0 |
| రుక్మాంగద చరిత్ర | ... | 1- 0-0 |
| ఆర్యకథానిధి 1 నుండి 8 వరకు. భా 1కి | | 1- 8-0 |
| నారీధర్మములు 3 భాగములు | ... | 1-12-0 |
| గేయరామాయణము | ... | 0- 2-0 |
| కోదండరామస్వామి మాహాత్మ్యము | ... | 1- 0-0 |
| దేవాలయతత్త్వము | ... | 0- 1-0 |
| శ్రీవాసుదాసస్వామి ఆసనపటములు ఒక్కొక్కటి | | 0- 1-0 |
| శ్రీవాసుదాసస్వామి ఉద్యోగము | ... | 0- 2-0 |
| శ్రీవాసుదాసకీర్తనలు (తృతీయముద్రణము) | | 1- 0-0 |
| వందనశతి (దాసశేషకృతము) | | 0- 8-0 |
| గోవిందదామోదరస్తోత్రము ,, | | 0- 2-0 |
| నుతిత్రయము, దండకత్రయము ప్రతి 1కి | | 0- 2-0 |
| కృష్ణమంజరి | ... | 0- 1-0 |
| కోదండరామ సాక్షాత్కారము (త్రివర్ణము) | | 0- 4-0 |
| నారాయణద్వయమంత్రమూర్తి (ఫోటో) | | 0- 4-0 |
| సంధ్యావందనము | ... | 1-12-0 |
| బ్రాహ్మణుల కాత్మావలోకనము | ... | 0-12-0 |

వలయువారు:—

శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము,

అంగలకుదురు P. O. (via) తెనాలి.